# విశ్వహిందు

అక్టోబర్
1996

ధార్మిక సామాజిక మాస పత్రిక



విశ్వహిందూ పరిషత్ - ఆంధ్రప్రదేశ్



# 'విశ్వహిందు'

(ధార్మిక, సామాజిక మాసపత్రిక)


| సంపుటి : 10 | సంచిక : 10 | ధాత - భాద్రపదం | అక్టోబర్-1996 |
|---|---|---|---|



ప్రధాన సంపాదకులు :

**ప్రొ. బి. రామరాజు**

సంపాదకులు :

**పింగళి సుందరరావు**

సలహా మండలి :

**శ్రీ పి.వి. యస్.నాయుడు** విజయవాడ (పూ.ఆం)

**డా. కసిరెడ్డి వెంకటరెడ్డి** భాగ్యనగర్ (ప.ఆం)



చందా వివరములు

జీవిత సభ్యత్వం రూ. 500.00

వార్షిక చందా – రూ. 50.00

విడిప్రతి – రూ. 5.00

డి.డి.లు **'విశ్వహిందు'**

అని మాత్రమే పంపవలెను.



చిరునామా :

'విశ్వహిందు'

4-5-212, ''విజయశ్రీ''

కోఠి, భాగ్యనగర్ – 500 095.

ఫోన్: 517799, 591322.


ఈ సంచికలో ........ పుట



ముఖ చిత్రం : శరన్నవరాత్రుల - శక్తి    చిత్రం : జి. రమేష్

## సంపాదకీయం

# జాగ్రత్తులైన దేశవాసులకొక విజ్ఞప్తి

ప్రియబంధూ !

ఈనాడు భారతదేశంలో 80వేల మంది క్రైస్తవ మతప్రచారకులు, లక్షలమించి ఇస్లామ్ ప్రచారకులు హిందూ సమాజం మీద ధర్మాంతరణ (వాస్తవానికి మతాంతరణ)కు సంబంధించిన భయంకర ఆక్రమణను అనేక దశాబ్దాలుగా, యోజనాబద్ధంగా కొనసాగిస్తున్నారు. గడచిన అనేక దశాబ్దాలుగా విదేశాలలోని అవే మతాలకు చెందిన వారినుంచి కొన్ని వేలకోట్ల రూపాయలను స్వీకరించిన పై మతప్రచారకులకు సంబంధించిన కొన్నివేలమంది పేర్లు గృహ మంత్రాలయంలో (హోమ్ సెక్రటరియేట్‌లో) నమోదు చేయబడియున్నవి. దీని ఫలితంగా సంవత్సరానికి నాలుగు లక్షల మంది హిందువులు క్రైస్తవులుగా మారిపోతున్నారు, వారికన్న అధిక సంఖ్యలో ఇస్లామ్ బారికి గురి అవుతున్నారు. జనాభా లెక్కలలో ఈ రెండు మతాలకు చెందిన వారి సంఖ్య నిరంతరము పెరగడమే ఇందుకు నిదర్శనము. కొన్ని సంవత్సరాలుగా క్రైస్తవులు తమనుతాము క్రైస్తవులమని వ్రాయించుకోకుండా 'అన్యులు' అని నమోదు చేయించుకుంటున్నారు. ఈవిధంగా మతాంతరీకరణ అయిన వారిని మతోన్మాదులైన ఆటంకవాదులుగా తయారు చేసే పనిలో విదేశాలనుంచి నిరాటంకంగా అత్యధిక ధన సహాయాన్ని అందుకుంటున్న సహాయసంస్థలు నిమగ్నమైయున్నవి.

ధర్మ నిరపేక్షతయన్న నిరర్థక నినాదం కారణంగా 80కోట్ల హిందువులు తమదైన హిందూ సమాజంలోనే యుపేక్షింపబడుతున్నారు. దీనివలన భవిష్యత్తులో ఇంకనూ భయంకరస్థితి యుత్పన్నమయ్యే అవకాశమున్నది. కావున మనం మేలుకొనాలి. ఈ విషయాన్ని గురించి ఆలోచించాలి. మన సమాజానికి మనమేమి చేస్తున్నామని ప్రశ్నించుకోవాలి.

మనం రాబోవు మూడు సంవత్సరాలలో హిందూ సమాజాన్ని రక్షించగల, కనీసం పదివేలమంది హిందూ మిషనరీలను ప్రశిక్షణ యిచ్చి హిందూ ధర్మరక్షణ కోసం నియమిద్దాము. వీరి యోగక్షేమాలకు సంబంధించి ఏర్పాట్లు మన ప్రియతమ దేశవాసులు చేయవలసియుంటుంది. ఈ సమర్పిత, పూర్ణకాలీన కార్యకర్తలలో నవయువకులు, వానప్రస్థులు - ఇద్దరూ ఉండడము అవసరమౌతుంది.

రాబోవు శతాబ్దానికి ముందే ఈ హిందూ మిషనరీల విస్తరణ దేశం యొక్క మూల, మూలకూ పాకాలి. సమాజ విఘటనను నిరోధించడము, సామాజికసమరసత, సమాజ సేవలకు సంబంధించిన బృహత్తర ఆయోజన ఈ సేవాప్రకల్పాలు, సత్సంగాలు, అక్కడగల దేవాలయాల పునరుద్ధరణలు, ధర్మానుష్ఠానాలు, వ్యాయామశాలలకు సంబంధించిన వ్యవస్థలనేర్పాటు చేయవలసియున్నది. అయితే ఈ కార్యక్రమాలన్నీ ప్రతి రాష్ట్రంలో కొనసాగుతూనే యున్నవి. 25వేల సేవాప్రకల్పాలు తమ కృషిని కొనసాగిస్తూనే యున్నవి. కానీ వీటి విరాడ్రూపం కనబడితేనే సమస్యకు స్థాయీ రూపమైన పరిష్కారం జరుగగలుగుతుంది.

మన కర్తవ్య నిర్వహణలో ఏ కొంచెం వెనుకబడినా విశ్వంలోని ఈ రెండు శక్తులూ (క్రైస్తవ, ఇస్లాం) హిందూ సమాజాన్ని ముక్కలు చెక్కలు చేయగలగడమేగాక మనం మన ప్రియమైన స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకుంటాము. విధర్మీయులు, వారిని సమర్థించే వారూ మనవాళ్ళేనన్న భ్రమలో

మనం పడకూడని సమయమాసన్నమైనది. మన సమాజాన్ని, మన సంస్కృతి, మనదేశం, మన ధర్మాల రక్షణ కోసం దరిద్రాతి దరిద్రుడైన హిందువు కూడా కొంతలో కొంత త్యాగం చేయవలసిన సమయం వచ్చింది. మీరు స్వయంగా రూ.2,000/-లు చెల్లించి ఆజీవన హితచింతకులు కావాలని, అట్లే మీ కుటుంబంలోని వారిని, ఇతరులను కూడా చేర్పించి హిందూ సమాజం విషయం మీ కర్తవ్యాన్ని పూర్తిచేసుకోగలరని ఆశిస్తున్నాము.

మీరు వానప్రస్థులుగా జీవనవ్రతుల పరంపరలో పూర్తి సమయమీయగల వారుగా జేరగలిగినా లేక నిర్దిష్ట సమయాన్ని యీయగలిగినచో హిందూ సమాజాన్ని శక్తివంతం చేసేపనికి తప్పక సహకారికాగలదు. జీవితం కృతార్థమయినదన్న అనుభూతిని పొందడానికి మీరు అధికారులు కాగలుగుతారు. మీ కుటుంబంలో ఒక్క సేవాభావంగల పిల్లవానిని కొంత కాలానికైనా పూర్ణకాలిక కార్యకర్తగా సమాజసేవ కొరకు ప్రోత్సహించండి.

యావత్తు దేశంలో అన్ని రంగాలలో కొనసాగుతున్న వివిధ విధ కార్యక్రమాలను గురించి హిందూ సంఘటన కార్యంలో నిమగ్నుడైన మీ సమీప కార్యకర్త ద్వారా తెలుస్తుంది. మీ యభిరుచికి, మీ శారీరక శక్తికి అనురూపమైన కార్యాన్ని మీరు ఎంచుకొని ఆ పనిలో నిమగ్నులుకండి. కొద్దిపాటి ఆలస్యం కూడా చేయకండి. పరిస్థితుల యొక్క తీవ్రతను గమనించి ధార్మిక, సామాజిక సేవాకార్యంలో నిమగ్నులవండి. మీ ప్రాంతంలోని పరిషత్కార్యకర్త మీకు తగిన కార్యాన్ని ఎంచుకునే పనిలో మార్గదర్శనం చేయగలుగుతాడు. సమాజ కార్యనిర్వహణకై కొంతకాలం మీకు శిక్షణ కూడా అవసరముంటుంది కావున సిద్ధం కావాలి.

మీనుంచి లభించే శక్తి రాబోవు శతాబ్దంలో కేవలము హిందువులకు కలిగే సంకటమునుంచి ముక్తిని ప్రసాదించడమేగాక భారతీయ ఆధ్యాత్మిక, సాంస్కృతిక గౌరవాన్ని విశ్వం యొక్క మూల, మూలలలో పున: ప్రతిష్ఠించగలుగుతుంది.

మీ ప్రత్యుత్తరం అందితే మేమెంతో కృతజ్ఞులము. మీ పోస్టుకార్డు జేరగానే మా కార్యకర్త మిమ్మల్ని కలుసుకుంటాడు.

ధన్యవాదములు.

अशोक सिंहल

-(అశోక్ సింఘాల్)

(వి.హిం.ప కార్యాధ్యక్షులు)

---

దైవభక్తుడైన ధర్మాత్ముమ్మ ఘించగ
దేశభక్తి గల్గి - దీక్షబూని
హిందు జాతి కింత హితము సేయగలెన్స
విశ్వహిందువాణి వినుడు వినుడు.

- సుందరం

ఇందలిరచయితల అభిప్రాయములకు సంపాదకులు బాధ్యులుకారు. - సం

# శరన్నవ రాత్రులు

అమ్మవారినిమిత్తము : ఆశ్వయుజశుక్ల
పాడ్యమి యందు – అభ్యంగనస్నాన ద్రవ్యములను
విదియ యందు – కేశములను
తదియ యందు – ముడివేయతగిన వస్తువులు
చవితి యందు – సిందూరాది ద్రవ్యమును
పంచమి యందు – మంచి గంధము, మొ॥ అంగరాగాది ద్రవ్యములు
షష్ఠి యందు – బిల్వవృక్ష సమీపాన మేల్కొల్పవలెను
సప్తమి యందు – గృహ మధ్య యందుంచి పూజించవలెను
అష్టమి యందు – దుర్గాష్టమి– ఉపవాసంతో పూజచేయవలెను
నవమి యందు – మహర్నవమి – చండికకు బలిదానము
దశమి నాడు – ఉత్సవముతో సాగనంపవలెను.

ఈ విధముగ పూజలు చేసిన వారిని దేవికుమారస్వామిని వలె ప్రేమించి పుత్ర, ధన, కీర్తులనినిచ్చి రక్షించును.

– వెంపటి లక్ష్మి నారాయణశాస్త్రి
(మన పండుగలు – మనకర్తవ్యం)

★ అక్టోబర్ 12 – మహాలయఅమావాస్య
13నుండి 20వరకు నవరాత్రులు
21విజయదశమి.

---

" ఐదేండ్ల కాంగ్రెస్ పాలనలో ఉప్పుధర కూడమక్కులకెక్కింది"

– వాజ్‌పేయి

---

# మనోనిబ్బరం

వల్లభాయిపటేల్ న్యాయవాదిగా ప్రాక్టీసు చేస్తున్నారు. క్రిమినల్ లాయరుగా పేరుపొందాడు.

ఒకనాడు ఆయన భార్యకు జబ్బుచేసింది. ఆమెను బొంబాయి ఆసుపత్రిలో చేర్చారు.

ఆమె ఆసుపత్రిలో వుండగానే వల్లబాయ్ ఒక హత్యకేసు సందర్భంగా ఆనంద్ నగరంలో సెషన్సు కోర్టులో వాదించడానికి వెళ్లాడు. ఆయన ఆనంద్‌కు వెళ్ళిన కొద్ది గంటల్లోనే భార్యకు ఆపరేషన్ జరిగింది.

వల్లభాయి కోర్టులో వాదిస్తుండగా టెలిగ్రాం చేతికి అందించి. దాన్ని చూచి జేబులో పెట్టుకొని ఏమీ చలించకుండా వాదన కొనసాగించి ముద్దాయికి శిక్షపడకుండా కాపాడాడు.

తర్వాత తన తోటిన్యాయవాదులకు టెలిగ్రాంలోని సంగతి చెప్పాడు. అందులో వల్లభాయి భార్య మరణించినట్లు వున్నది! ఆయన మనోనిబ్బరానికి అంతా ఆశ్చర్యపోయారు.

(అక్టోబర్ 31–పటేల్ జయంతి) (సంకలనం)
–మన్నవ గిరిధరరావు

# షోడశ (16) మాతలు

స్తనదాత్రీ గర్భధాత్రీ భక్ష్యదాత్రీ గురుప్రియా!
అభీష్టదేవ పత్నీ చ పితుఃపత్నీ చ కన్యకా॥
సగర్భజా యా భగినీ పుత్రపత్నీ ప్రియా ప్రసూః!
మాతుర్మాతా పితుర్మాతా సోదరస్య ప్రియా తథా॥
మాతుః పితుశ్చ భగినీ మాతులానీ తథైవ చ!
జనానాం వేదవిహితా మాతరః షోడశ స్మృతాః॥
(బ్రహ్మవైవర్త పురాణం గ.15 అ.)

1. స్తన్యము (తల్లిపాలు) ఇచ్చు తల్లి, 2. గర్భము ధరించు స్త్రీ, 3. భోజనం పెట్టు స్త్రీ, 4. గురు పత్ని, 5. ఇష్టదేవతా పత్ని, 6. తండ్రి భార్య (సవతి తల్లి), 7. తండ్రి కుమార్తె (సవతి తల్లి కుమార్తె), 8. స్వంత చెల్లెలు (సహోదరి), 9. కొడుకు భార్య (కోడలు), 10. భార్య తల్లి (అత్త), 11. అమ్మమ్మ , 12. నాయనమ్మ 13. వదిన (అన్న భార్య) , 14. పిన్నమ్మ (బాబాయి భార్య), 15. మేనత్త (తండ్రి సోదరి), 16. అత్త (మేనమామ భార్య).

వేదములో ఈ పదహారు మంది, మానవులకు తల్లులుగా చెప్పబడినారు.

సేకరణ : గార్లపాటి సత్యలీలా, పొదిలి.

వేదములోని షోడశమాతలతో బాటు ప్రతి భారతీయునికి (1) భూమాత, (2) గంగామాత, (3) గోమాత, (4) గీతామాత, (5) వేదమాతలు ఐదుగురు కలిసి ఏకవింశతి (21) మాతలు గలరు.

---

# శాంతి మంత్రము :

(ఓం) పూర్ణమదః పూర్ణమిదం,
పూర్ణా త్పూర్ణ ముదచ్యతే!
పూర్ణస్య పూర్ణమాదాయ,
పూర్ణమేవా వశిష్యతే॥
ఓం శాన్తిః శాన్తిః శాన్తిః (శుక్లయజుర్వేదము)

ఆ బ్రహ్మము పూర్ణమైనది. ఈ జీవజగత్తు కూడ పూర్ణమైనది. ఆ పూర్ణ వస్తువునుండి యీ పూర్ణ పదార్థము కలిగినది. ఈ పూర్ణవస్తువు (జ్ఞానముచే) పూర్ణత్వమును గ్రహించి, పూర్ణవస్తువుగనే పరిఢవిల్లును. అనగా నేను జీవునైనను శివానుభూతినుండును. అది భౌతిక, అధి దైవిక, ఆధ్యాత్మిక తాపములు శమించుగాక!

సేకరణః-మిత్తింటి వెంకటరావు.

మాతృమందిరం :

# శ్రీ శారదామాత అమృత వాక్కులు

రోజూ ప్రదోష సమయంలో కొద్దిసేపు భగవంతుని ధ్యానము చేయి. అప్పుడు నీ మనస్సు చెడు ఆలోచనలవైపు పోదు. మనస్సు నిర్మలంగా ఉంటుంది. సాధ్యమైనంతవరకు రోజూ నిర్ణీత సమయంలో - ప్రార్థన చేయుటం మంచిది.

యీ మనుష్య జన్మ పుణ్య ఫలం వల్ల లభించింది. అందుకే -దాన్ని సద్వినియోగం చేయి.

ప్రార్థన లో నీవు దేవునికి సర్వస్వం శరణాగతిచేయి. దైవానుగ్రహం వెంటనే కలుగలేదని- సాధన మానకు.

గురూపదేశం అవసరం. దానివల్ల చిత్తశుద్ధి పవిత్రత కలుగుతాయి.

ఏ పనిచేస్తున్నా - యింట్లో పనులు చేసుకుంటున్నప్పుడు నీయిష్టదైవనామ జపమోలేదా భక్తిగీతమో ఆలాపించుకుంటూ చేయి. అప్పుడు అలసట అనిపించదు.

మనస్సు నిలకడ లేకపోయినా జపం, నామజపం మానకు. క్రమంగా మనస్సు నిశ్చలమౌతుంది.

ఇతరులు నీకు చేసిన ఏ చిన్న ఉపకారాన్నైనా మరవకు. ఇతరుల తప్పులను ఎంచకు. క్షమించటం దివ్యలక్షణం.

మనశ్శాంతి కావాలనుకుంటే- యితరుల తప్పులెన్నటంమాను. తప్పులెంచాలని వుంటేనీ లోపాలనీ చూచుకో.

మనస్సే అన్నింటికీ మూలం. పవిత్రత, అపవిత్రతల అనుభవం మనస్సుతోనే ప్రారంభం. నీ మనస్సు కలుషితమైతేనే యితరుల దోషాలను ఎంచుతావు.

చంచలత్వమే మనస్సు యొక్క సహజగుణం. మనస్సు స్థిరమైతే స్థిరత్వం సిద్ధించును.

మనస్సులోకి పనికి మాలిన ఆలోచనలను రానీయకు.

మాటలచేత నైనా యితరులను నొప్పించకు. అప్రియమైన సత్యం మాట్లాడకు. మొరటుగా మాట్లాడేవాళ్ళ మనోస్వభావం కూడా మొద్దు బారిపోతుంది. వాక్కుని నియంత్రించలేని వాళ్ళకి పరశత్వం నశిస్తుంది. కుంటివాడిని నీవు ఎల్లాకుంటివాడివయ్యావని అడగకూడదు.

దేవుణ్ణి నీలోభక్తి ని వివేకాన్ని ప్రసాదించమని ప్రార్థించు. యివికోరికలలో చేరవు.

దేవాలయాలు

# స్ఫూర్తి కేంద్రం రామప్ప గుడి

రామప్పగుడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం, వరంగల్ జిల్లా వెంకటాపూర్ మండలం, పాలం పేట గ్రామంలో వయులుగు గ్రామానికి 15 కి.మీ. దూరంలో, దాదాపు 790-58'- తూర్పురేఖాంశము, 180-17' ఉత్తర అక్షాంశము పై ఉన్నది.

ఇచట ఆరాధ్య దైవం రామలింగేశ్వర స్వామి.

ఆలయ ఆవరణలో గల శిలాశాసనం ప్రకారం ఈ ఆలయం శక సంవత్సరం 1135, శ్రీముఖనామ సంవత్సరం, చైత్ర శుద్ధ అష్టమి ఆదివారం పుష్యమి నక్షత్రం, క్రీ.శ. 1213 సంవత్సరం నాటికి నిర్మించబడినది. ఈ ఆలయం కాకతీయ గణపతి చక్రవర్తి కాలంలో 'రామప్ప' అను శిల్పి ఆధ్వర్యంలో రేచర్ల రుద్రయ్య అను సేనానిచే నిర్మించబడినది. శిలాశాసనం ఆనాటి తెలుగు లిపిలో సంస్కృత భాషలో ఉన్నది. శాసనంలో, రేచర్ల రుద్రయ్య యొక్కయు ఆయన పూర్వీకుల యొక్క వీరగాథలు, దేవాలయం ఎవరి శత్రువు కాదనియు దాని రక్షణ, పోషణ నిర్వహించిన వారికి రెండు చేతులెత్తి మ్రొక్కెదనను'', రేచర్ల రుద్రయ్య విజ్ఞప్తియు, ఆలయ పోషణకు ఇచ్చిన గ్రామాల పేర్లు మున్నగు విషయములున్నవి. శిలాశాసనం పైన, దక్షిణం వైపున ధర్మ స్వరూపమైన ఆవు, లేగ, వాని ముందు దూసిన కత్తి శిల్పంకలదు. ఈ శిల్పం, ''ధర్మో రక్షతి రక్షితః'' అను సూక్తికి ప్రత్యక్ష రూపంగా భావింపబడుచున్నది.

కాకతీయ సామ్రాజ్యం తూర్పున బంగాళా ఖాతం, పడమరన అరేబియా సముద్రం, ఉత్తరాన గోదావరి నదికి కొంచెం ఆవలి ప్రాంతం, దక్షిణాన కాంచీ పురం వరకు ఉండెడిది.

గణపతి దేవుడు 62 సంవత్సరాలు మహావైభవంగా పరిపాలించాడు. సామ్రాజ్యమునకు రాగల అపాయాలను గుర్తించాడు. వానిలో సామ్రాజ్య అంతర్గత శత్రువులు, భ్రష్టత పొందిన కొందరు జైనులు - ఉత్తర భారతం పైన జరుగుచున్న మహమ్మదీయ దండ యాత్రలు ముఖ్యమైనవి.

కాకతీయ సామ్రాజ్య జాతీయ ధర్మం శైవము. వరిష్టమైన సైన్యం నిర్మించబడి వారి హృదయాలలో శైవము ప్రతిష్ఠింపబడినది.

చిన్న, పెద్ద చెరువులు నిర్మించివాని గట్టున ఆలయాలు నిర్మించి ప్రజలకు భుక్తి, శక్తి, భక్తి, ముక్తులను కాకతీయులు ప్రసాదించినారు.

రామప్ప గుడి ప్రాంతం రాజ్యరక్షణ దృష్టిలో సామ్రాజ్య కంఠస్థానంలో ఉంది. అది సామ్రాజ్య హృదయమైన ఓరుగల్లును రక్షించుటలో ముఖ్యపాత్ర వహించినది.

రామప్పగుడి, వాస్తు, శిల్ప, సంగీత, నాట్య, శృంగార, నైతిక, భౌతిక, గణిత జ్యోతిష, మనస్తత్వ శాస్త్రాలు, దైవభక్తి దేశభక్తి, స్వధర్మ రక్షణ, పరమత సహనం, లౌకికం, హేతువాదం, క్రీడలు, చరిత్ర మున్నగు విద్యలు బోధించగల మహా విద్యాలయం.

రామప్పగుడి నాట్య శిల్పాలకు కాకతీయుల గజ సేనాధిపతి జాయప రచించిన నృత్యరత్నావళి ఆధారం.

దేవాలయం ఎత్తైన అరుగుపైన కట్టబడినది.

ఈ గుడికి తూర్పున, ఉత్తర, దక్షిణ దిక్కులలో మూడు బయటి ద్వారాలు కలవు. మూడు ద్వారాలకు, ద్వారానికి నాలుగేసి మొత్తం పండ్రెండు నిలువెత్తు, సుందర స్త్రీ మూర్తులు అలంకరించబడినవి. ఇవి ముఖ్యంగా వీర రసనాట్యం, నీతికి సంబంధించినవి. వీని తూర్పుద్వారానికి అలంకరించబడినవి ముఖ్యమైనవి. ద్వారానికి దక్షిణాన గల వానిలో మొదటిది, వివిధ భూషణాలతో, ఎత్తు మడమలుగల చెప్పులు ధరించిన స్త్రీ యొక్క బట్టను ఒక కోతిలాగుచున్నది. అది ఊడిపోవుచుండగా ఆమె మాన రక్షణకై ఎడమచేయి పోగా, కోతిని శిక్షించుటకు కుడి చేయి లేచినది. ఆ కోతి, నిజానికి కోతి కాదు, కోతి చేష్టలు గలిగిన పురుషుడు. దానికి ప్రక్కన గల శిల్పము 'నాగిని' అనబడునది. ఈ శిల్పంలో బట్టలు ఊడదీయ బడగా నగ్నముగా నిలిచిన స్త్రీ మూర్తి. ఎత్తిన చేతులలో పాము, పాదాలక్రింద పాము భుజాలనుండి వ్రేలాడుచు జననేంద్రియమును పడగతో కప్పిన మరోనాగము. శృతిమించిన శృంగారజనులను తన అంగాంగము కాల సర్పమై కాటేయ గలదను స్పష్టమైన హెచ్చరిక చేస్తున్నది. (ఇవి పురుషుని ఆధిక్యతను సూచించుచున్నవి).

ఇక అదే ద్వారానికి ఉత్తరం వైపుగల దానిలో ఉత్తరం వైపున గలది. ఇందు ఒక స్త్రీమూర్తికి కాలి ముల్లు తీస్తున్న పురుషుడు. ఇది స్త్రీ ఆధిక్యతను సూచిస్తున్నది. దీని ప్రక్కన తన నాట్య కళను దైవానికి అంకితము చేస్తున్న స్త్రీమూర్తికలదు.

(సశేషం)




# భాగవతము - శ్రీ కృష్ణ తత్త్వము

డా॥ ఎమ్. వి. ఆర్. శర్మ

హిందువుల జ్ఞాన సముద్రము వేదములు. ఆ వేదములకు ఉపబృంహకములు పురాణములు. చతుర్వేదాలనూ సాంగంగా తెలిసినా పురాణ జ్ఞానము లేనిచో పూర్ణజ్ఞాని కానేరడు. అట్టివాడు తనకు ఘాత చేయునని వేదమాత బెదరిపోవునట.

''బిభేత్యల్ప శ్రుతాద్వేదో మామయం ప్రతరేదితి
ఇతిహాస పురాణాభ్యాం వేదం సమునబృంహయేత్''

పురాణములు శ్రీ వేద వ్యాసవిరచితములు. మహాపురాణములు 18, వానికి 18 ఉపపురాణములు. మహాపురాణములు పంచలక్షణములు గలవి. సర్గశ్చ, ప్రతి సర్గశ్చ, వంశో, మన్వంతరాణిచ వంశాను చరితం చేతి పురాణం పంచలక్షణమ్॥

అవి 1)సర్గము 2)ప్రతి సర్గము 3) వంశము 4) మన్వంతరము 5)వంశానుచరితము అత్రసర్గో, విసర్గశ్చ, స్థానం, పోషణ, మూతయః మన్వంతర, ఈశాను కథా, నిరోధో, ముక్తిః, ఆశ్రయః॥

భాగవత మహాపురాణమునకు మాత్రము దశల
క్షణములున్నవి. అధికముగా గల ఆ అయిదును
భాగవత మహా పురాణైక స్థిత లక్షణములు

పురాణాల్లో కెల్లా భాగవతానికి ప్రాముఖ్యాన్ని వున్నట్టే, భాగవతంలో కృష్ణావతార ఘట్టం వున్న దశమస్కంధం మిగతా అన్ని స్కంధాల కన్నా రాశిలోనూ, వాసిలోనూ మిన్న అయింది. రామాయణంలో సుందరకాండ ఎలాగో, భాగవతంలో దశమస్కంధం ఆలాగా. భాగవత తత్త్వం అంతా యీస్కంధంలో యిమిడి వున్నదనే దీన్ని సర్వసంగ పరిత్యాగులైన సన్న్యాసులు కూడా పారాయణం చేస్తారు. భాగవతంలోని తొలి తొమ్మిది స్కంధాలు దశమ స్కంధానికి పీఠిక లాంటివి- ''దశమస్య విశుద్ధ్యర్థం నవానా మిహ వర్ణనమ్''.

భాగవతము కేవల పురాణమే గాక నిగూఢ వేదాంతార్థ ప్రతిపాదకము గూడ. దానిని అర్థము చేసుకొనుట అంత సులువైన విషయము కానే కాదు. పైకి మాత్రము మామూలు కథల గుచ్ఛమువలె, బాలురకు, పామరులకు గూడ అర్థముయినట్లుగానే ఆభాసించును. తఱచి చూచిన గాని అందుగల విశేషార్థములు తెలియరావు. ఇందు మూలమున ఒక్కొక్క మారు కృష్ణ భగవానుడు కొన్ని వింతపనులు చేసినట్లు గోచరించును. మఱి కొన్ని మన సమకాలీన సమాజపుటాలోచనల, కల్పనల చట్రములో యిముడ్చునట్లు, యిముడలేనట్లు తోపును కొందఱు భాగవతములోని శ్రీ కృష్ణ లీలలను కట్టు కథలను కొనుటయు, ఖండించుటకు పూనుకొనుటయు గూడ కద్దు.

శ్రీ కృష్ణుడు ఎనమండుగురు భార్యలను పరిణయ మాడుట, గోపికా వస్త్రాపహరణం రాసలీల; మొదలైన సంఘటనలు ఎంతో నర్మ గర్భితములై, పారమార్థిక చింతనా స్వాంతులకు ఆలోచించిన కొద్దీ అమందానం దాన్ని అందిస్తూ, వేదాంతాన్ని కరతలా మలకం గావిస్తూ వుంటాయి.

అష్ట మహిషుల దాకా ఎందుకూ? మామూలు మనుష్యుల దృక్కోణంతో చూస్తే అసలు కృష్ణుడు రుక్మిణినైనా పెండ్లి చేసుకున్నాడా అన్నది పెద్ద ప్రశ్న. కృష్ణుడు ఆజన్మ బ్రహ్మచారిగా కూడా గణుతికెక్కిన వాడు. పెళ్లి చేసుకొని అస్ఖలిత బ్రహ్మచారిగా వుండగలుగడం ఎలా సంభవం? ఈ ప్రశ్నకు జవాబును ఆత్మపరమాత్మల సంబంధమనే వొక నేపథ్యంలో వెతుకవలసి వుంటుంది.

ఆంధ్ర భాగవతాన్ని రచించిన పోతన ఆదిలోనే

భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన, తమ్మి చూలికైన

పిబుభవరసం వంన పిన్నంత నన్నంత
తెలియ వచ్చినంత తేట పఱతు

అని సవినయంగా, సభక్తికంగా భాగవతం యొక్క ప్రౌఢత్వాన్ని ఆలంకారికంగా మనముందుంచినాడు.

రుక్మిణీ కల్యాణారంభంలో

❀ వినుము విదర్భ దేశమున వీరుడు కుండిన భర్త భీష్మకుండను నొక దొడ్డరాజు గలడాతని కేవురు పుత్రుల గ్రజుండనఘుడు రుక్మి నాబరగు నందరకుం గడగొట్టు చెల్లెలై మనుజవరేణ్య పుట్టెనొక మానిని రుక్మిణి నా బ్రసిద్ధయై

అనివున్నది. పరిశీలిస్తే విదర్భదేశమున = పవిత్రంగావున్న మనుష్యదేహంలో, వీరుడు = వేదాలు, పురాణాదులు ఎన్నో రకాలుగా పరమాత్మను ప్రతిపాదిస్తూ వుండగా వీటన్నిటినీ సమన్వయం చేసినవాడు (భగవద్గీత: వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో.....),

కుండిన భర్త: హృదయ కమలవాసి, భీష్మకుడు: అజ్ఞానం, మాయావరణం, విక్షేపశక్తి మొ॥వాడికి భయంకరుడు, అనుదొడ్డ రాజు వున్నాడట. అతనికి ఏవురు పుత్రులు: పంచములు అనే కొడుకులు. పంచములు.

1. ఆణవం: వస్తుజ్ఞానం పెంచి బ్రహ్మజ్ఞానం తగ్గించేది.
2. కార్మికం: సద్గురువులు బోధ చేస్తున్నప్పుడు వచ్చే అడ్డంకి.
3. మాయికం: అసలు పరమాత్మను గురించిన జ్ఞానాన్ని ఉదయించకుండా చూసేది.
4. మామేయం : మనసులో పాపకార్య ప్రేరణ చేసేది.
5. తిరోధానం: దైవం కాకుండా యితర తుచ్ఛ ధర్మాలు సత్యాలనే బుద్ధిని పుట్టించి జనన, మరణాల చక్రంలో పునః పునః పడవేసేది.

ఈ అయిదుగురు కొడుకులు పుట్టిం తర్వాత గానీ బ్రహ్మజ్ఞానం పుట్టుట జరుగదు గదా! వాళ్లు అయిదుగురూ అన్నలు. అందరి తరువాతా ''కడగొట్టు చెల్లెలు'' బ్రహ్మవిద్య. ఈమె పేరు రుక్మిణి. రుక్మ మస్యాస్తీతి రుక్మిణీ. సువర్ణం కలది అని అర్థం. వేదంలో ''తత్సువర్ణగ్ం హిరణ్య మభవత్. తత్సువర్ణస్య హిరణ్యస్య బ్రహ్మేతి'' అని వున్నది గనుక హిరణ్యమంటే పరబ్రహ్మ. ఆ పరబ్రహ్మను తెలియజేసేది. ఈ అన్నా చెల్లెళ్ల బంధం యింకో రకంగా కూడా చెప్పవచ్చు. మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః- అని గీతావాక్యము. మనస్సునుంచే అటు బంధ కారణాలు (రుక్మిమొదలైన సోదరులు) ఇటు మోక్ష కారణము (రుక్మిణి) పుట్టి వున్నాయి.

ఇలా పుట్టి పెరుగుతూ వున్న రుక్మిణిని (బ్రహ్మ విద్యను) కృష్ణునకు (పర బ్రహ్మమునకు) సమర్పించుదమని బంధువులు (బ్రహ్మ వేత్తలు) అందరూ అనుకుంటూ వుంటే రుక్మి (జీవాహంకారం) మాత్రం అంధుడై (నిత్య, అనిత్య వస్తువివేకం లేని వాడై) ఆ బాలికను శిశుపాలునికి (శ్రుతి, యుక్తి, అనుభవం-లేని అజ్ఞానులను పాలించే రాజుకు) యిద్దామని తలిచినాడట.

చివరన యేమి జరిగిందీ? శ్రీ రుక్మిణీ దేవి అనే బ్రహ్మ విద్యను శ్రీ కృష్ణుడు అనే పరబ్రహ్మమే పెండ్లి యాడినాడు - జ్ఞానం గెలిచింది. అజ్ఞానం తలవంచుకున్నది.

ధ్రువ కీర్తిన్ హరి పెండ్లి యాడె నిజచేతో హారిణి.................... రుక్మిణిన్.

ఈ విధంగా మథించిన కొద్దీ ఒక్కొక్క శ్లోకం/పద్యం తాత్త్విక చింతనకు దారి చూపుతూ చిన్ని, చిన్ని కథల మాటున గహన, గంభీర భావాలను వెదజల్లుతూ ఆధ్యాత్మిక జ్ఞానాన్ని తమ ముందు తరాల వారికి అందజేసే ప్రాచీన హిందువుల తహతహ, ఆ సఫల ప్రయత్నపు రామణీయకతా వ్యక్తం చేస్తున్నాయి.

బాలకృష్ణుడు పాలు, పెరుగు, వెన్న దొంగిలించినాడా? భాగవతంలో బహుళ ప్రచారంలో వున్న పద్యం వొకటి:

ఓ యమ్మ! నీ కుమారుడు మా యిండ్లను పాలుపెరుగు మననీడమ్మా!

పోయెద మెచ్చటి కైనను, మాయింట్లను సుదతు, లాన, మంజులవాణీ॥

పాలు, పెరుగు, మొ॥వి మన చిత్త వృత్తులు. చిత్తానికి ''వృత్తు''లుంటాయి. అవిద్య లేక అజ్ఞానం మూలంగా (1)లేనిది వున్నట్లు అగుపడుట (HALLUCINATION) ఉదా: ఎండమావి (2) ఉన్నది వున్న రూపంలో కాక మరోరకంగా కనబడుట (ILLUSION) ఉదా: తాడు పామువలె కనబడుట (3) ఉన్న వస్తువు వున్నదా లేదా అనే అనుమానం వచ్చుట (4) తలక్రిందులుగా వున్న దానికి విరుద్ధంగా కనబడుట మొదలగు – అసంభావనా, విపరీత భావనా, సంశయ, విపర్యయములనే ఆలోచనలు వస్తూ వుంటాయి, ఈ తర్కాలనన్నిటినీ కృష్ణ పరమాత్మ శ్రుతి, ప్రత్యక్షము, ఐతిహ్యము, అనుమానము అనే ప్రమాణాలతో ఖండిస్తూ వున్నాడట. ఇంక యీ తర్కములు ''మన''జాలవు గదా! మామూలు మనుష్యజన్మలో మాత్రమే యీ వృత్తులు వాని ఆటలాడుట, వివేకియైన మనుష్య జన్మలో మాత్రమే వీటి ఆట కట్టు గదా. మన జాలని యీ చిత్త వృత్తులు వివేక వంతులైన గోపికలను విడిచి యింకెవరైనా అవివేకులను ఆశ్రయిస్తాయని చెప్పుట యీ పద్యపుటంతరార్థము.

మరొక పద్యం:

కాంతలు తల్లితో దన వికారము లెల్ల గణింప భీతుడై
శాంతుని సొంపున, న్వరమ సాధుని పెంపున, గోలమాడ్కి, వి
భ్రాంతుని కైవడిన్, జడుని భంగి, కుమారకు డూరకుండెనే
వింతయు లేక దల్లి కుచవేదిక పై దల మోపి యాడుచున్॥

కాంతలు.....గణింపన్: మూఢులందరూ నిర్వికారమైన పరబ్రహ్మం బహు వికారాలతో కూడుకున్నదీ అంటూ వుంటే.

భీతుడై: ఈ భక్త జనులు మాయలో పడి నన్ను సరిగా చూడలేక పోతున్నారే, అవికారుడనైన నన్ను సవికారుడంటున్నారే, వీళ్ల గతియేమి అని భక్తుల గురించి వెఱచుతూ.

శాంతత్వ, సాధుత్వ, నిర్దోషత్వ, భ్రాంతత్వ, జడత్వాది గుణాలతో (''బాలోన్మత్త పిశాచవత్'') ఏమీ తెలియని అమాయకునివలె ముచ్చటగా ఆడుకున్నాడట. (సశేషం)

---

## మద్య పానం మంచిదికాదు

నహి ధర్మార్థ సిద్ధ్యర్థం పాన మేవం ప్రశస్యతే.
పానాదర్థశ్చ ధర్మశ్చ కామశ్చ పరిహీయతే॥.

## రామాయణం

భా:– మద్యపానము వలన ధనము ధర్మమేకాక కామము సహితము క్షీణిస్తుంది.

సం:–లక్ష్మణుడు సుగ్రీవుని కర్తవ్యోన్ముఖుడవు కమ్మని హెచ్చరించిన ఘట్టము.

వ్యా:– మద్యపానం ఒక వ్యసనం. ఇందుకు ధనం ఎక్కువ వ్యయమవడమే కాక శరీరం త్వరగా నశిస్తుంది. త్రాగిన మత్తులో ఏమి చేస్తున్నాడో తెలియక ధర్మాన్ని తప్పి బాధ్యతారహితంగా ప్రవర్తిస్తాడు. పెద్దల్ని నిందిస్తాడు మిత్రులను దూరం చేసుకుంటాడు. ప్రియులైనవారిని కూడ ఎంతగానో హింసిస్తాడు మతి మరుపుకులోనై కర్తవ్యాన్ని విస్మరిస్తాడు. అంతే కాదు ఇటువంటి వారు త్రాగితే ఏదో పొడి చేస్తామని అనుకోవడం కూడ వట్టి భ్రమగానే మిగిలి పోతుంది.

మత్తు పానీయాలకు అలవాటు పడటం వల్ల క్రమంగా నరాల బలహీనత ఏర్పడి, మనిషి నిర్వీర్యుడై నీరసించి తుదకు అస్తిత్వాన్నే కోల్పోతాడు. అందుకే ఆ వ్యసనం పాలుకాకండని మహర్షి మానవజాతిని ఉద్బోధించాడు.

–డా. తూ. శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి

(అక్టోబర్ 26–వాల్మీకిజయంతి)

# ఆలయభూముల అమ్మకాలపై అలజడి

ఆలయాలు, ఆలయభూముల విషయంలో ఆంధ్రప్రదేశ్‌లో ప్రజలు అర్చకులు తపస్యులు చాలా అలజడి చెందుతున్నారు. పైగా ఈ మధ్య వచ్చిన చట్టం సవరణలు, వానిపై కోర్టు తీర్పులు అలజడిని ఎక్కువ చేశాయి. అర్చకులంతా ఏకమై ఉద్యమం చేసేందుకు ప్రయత్నిస్తున్నట్లు తెలుస్తోంది. సంబంధంలేని సెక్యులర్ రాజకీయ సర్కార్ పెత్తందార్లు ఇలా ఆలయాలపై అధికారాలు చెలాయించడం నిజంగా ఘోరం.

ప్రజలు పట్టించుకోకపోతే ఇలాంటివి చాలా జరుగుతాయి. ప్రజలు అంటే పార్టీల పరిభాషలో ఓటర్లు. వీరికి స్వంతానికి ఏదైనా బాధకల్గితే గుచ్చుకున్నట్లు ఉమ్మడికి బాధ కల్గితే గుచ్చుకోదు. స్వంత భూమిని ప్రభుత్వం వశం చేశారంటే కలిగే బాధ, ఉమ్మడి దేవాలయం భూములను అమ్మకం చేస్తే కలగదు. ఆలయం భూములను మీకు పంచుతామంటే ఆమోదించే ధోరణితో పలుపురుంటారు. ప్రభుత్వానికి అలుసు ఇదే. అందుకే ఆలయభూములమ్ముతామంటే ప్రజలుమిన్నకుంటారు. అర్చకులు, ఆలయ సేవా దార్లు మాత్రం గిలగిల్లాడుతారు. అది వారి జీవితం మీద దెబ్బ తీస్తుంది కనుక వారి గొడవ జనసామాన్యానికి పట్టదు. ఉమ్మడి ఆలయాల గొడవ ఉభయులకూ పట్టదు. కొందరు మినహా యించదగిన మహనీయులు లేక పోలేదు. కాని స్థూలంగా పరిస్థితి ఇది. అంతా కలిపి ఉమ్మడిగా లేస్తేనే అనేక సమస్యలకు పరిష్కారం. ఆలయాలు బాగా ఉంటేనే కదా అర్చకులకు బాగు? అందరికీ సంక్షేమం? ఈమధ్య ఒక అధికారి ఒక భాధవ్యక్తం చేశారు. వారు ఆలయాలలో ఇన్స్‌పెక్షన్‌గ వెళ్లితే అక్కడ ,దీపారాధన బదులు కొవ్వొత్తి వెలుగుతొందట! దీపానికిచ్చిన నూనె అర్చకుడే త్రాగాడో, లేక ఆనూనెను మధ్యలో అధికార్లే తాగారో తెలియదు! ఏమైనా ఇలాంటి సంఘటనలు ప్రజలకు కూడా చికాకు కల్గిస్తాయి.

ఆలయాలు ధర్మప్రధానాలు. కాని ఆస్తిత్వానికి మూలాలు ధర్మ శాస్త్రాలు – అర్చకుల కున్న మూలం ధర్మశాస్త్రాలే. ధర్మంతో నిమిత్తం లేని సెక్యులర్ రాజకీయవాదుల సర్కార్‌లకు ఆలయాలతో నిమిత్తం ఉండే పనిలేదు. వారిపెత్తనం మాట అసలే పొసగదు. ఇది గుర్తించకుండా ఎవరెవరు తమ బాగు కోసం ఎన్ని చెప్పినా ప్రభుత్వంలోని రాజకీయవాదులు పట్టించుకునే అవసరం ఉండదు. ఆలయాలకు అన్యాయం జరిగితే మీకు ఓట్లు ఇవ్వం'' అని అందరూ ఉమ్మడిగా అనగల్గితే వారు పట్టించుకుంటారు. అన్యాయానికి తలపడరు. ఆలయాల గొడవకే దూరంగా ఉంటారు. మరి ఈ కీలకం అందరి మనస్సులకు ఎక్కవద్దా ? అంతవరకూ అక్రమాలకు, అన్యాక్రాంతాలకు విరుగుడు యెలా ఉంటుంది? అర్చకులు తమ బాగోగులేగాక తమలోని బాగోగులున్నూ చూచుకోవాలి. అలాగే ఇతరులునూ. అప్పుడే అందరిమధ్య పరస్పర సామభూతి, సహకార వాతావరణం నెలకొంటుంది.

అర్చకులకు చాలా సమస్యలు – జీవితానికి సంబంధించినవి చాలా ఉన్నాయి. ఆలయాలపై ఆధారపడిన ఇతరులకు ఉన్నాయి. భక్తులకూ ఉన్నాయి. యాత్రికులకూ ఉన్నాయి. ఆలయవ్యవస్థ పై రాజకీయపెత్తనం తొలగి, ధార్మికమైన ఆధిపత్యం ఏర్పడితే కొంతవిరుగుడు. భక్తసమాజ ప్రమేయం, చొరవ, ప్రభావం, చట్ట సంబంధమునైన భాధ్యతులుంటే మరికొంత విరుగుడు. ఉద్యమాలలక్ష్యం ఈ దిశలో ఉండి, ఆ ఉద్యమాలు ఉమ్మడిగా సాగితే ప్రయోజనాలు అధికారికంగా ఉంటాయి.

అందరూ కావాలనుకునేవి, ఎవరికీ గట్టిగా పట్టనివి దేవాలయాలు. ఈ వైరుధ్యం పోయి ఉమ్మడిగా ఉద్యమిస్తే ప్రభుత్వాల్లోని రాజకీయ వాదులూ ''మంచి వారే'' అయి పోతారు. లేకపోతే వారు ''మంచివారు'' ఎందు కైపోవాలి? దేవాలయాలకు ''మంచి'' మాత్రమే ఎందుకు జరగాలి?

"ధర్మ ప్రియ"

# తెలుసుకుందాం

1. IRS - IC అంతరిక్ష కక్ష్యలో ఎప్పుడు ప్రవేశించింది?
2. ద. ఆఫ్రికాలో నల్ల జాతి పాలన ఎప్పుడు ప్రారంభమైంది?
3. ప్రపంచ ఛెస్ ఛాంపియన్నైన భారతీయుని పేరేమి?
4. అంతరిక్ష యాత్ర చేసిన తొలి భారతీయుడెవరు?
5. తొలి ప్యారాచూట్ భారత మహిళ ఎవరు?
6. అంతర్జాతీయ పొదుపు దినం ఏది?
7. అంతర్జాతీయ యువజన సంవత్సరం ఏది?
8. 'బ్లూమౌంటెన్స్' అని వేనినంటారు?
9. 'రిఫ్రిజరేటర్' కనుగొన్నదెవరు?
10. పాలస్వచ్ఛతను కనుగొనే పరికరం పేరేమి?
11. U.N.I. అంటే?
12. జమ్మూ-కాశ్మీర్‌లో లోక్ సభస్థానాలెన్ని?
13. కాదంబరి గ్రంథకర్త ఎవరు?
14. 'గులాబీ' పుష్పం ఏదేశ చిహ్నము?
15. భారతదేశంలో మ॥12గం. లపుడు టోక్యోలో టైమ్ ఎంత?
16. సింగపూర్‌నాణెం పేరేమి?
17. మన జాతీయ సమైక్యతా దినం ఎపుడు?
18. భారతప్రథమ రాష్ట్రపతి ఎవరు?
19. మనదేశంలో జీడిపప్పు విరివిగా పండే రాష్ట్రమేది?
20. తెలుగులో మొదటి చలన చిత్రం ఏ సం॥లో?
21. అంతర్జాతీయ విశ్వహింద్ పరిషత్ ప్రధాన కార్యదర్శి ఎవరు?

జవాబులు:- (1) 28.12.1995 (2) 1994 (3) విశ్వనాథ్ (4) రాకేశ్‌శర్మ (5) గీతాఘోష్ (6) అక్టోబర్-30 (7) 1985 (8) నీలగిరి కొండలు (9) జె. పార్కిన్స్ (10) లాక్టోమీటర్ (11) యునైటెడ్ న్యూస్ ఆఫ్ ఇండియా (12) 6 (13) బాణభట్టు (14) బ్రిటన్ (15) మ॥2.00 (16) సింగపూర్ డాలర్ (17) అక్టోబర్. 31 (18) డా॥బాబు రాజేంద్రప్రసాద్ (19) కేరళ (20) 1931 (21) ఆచార్య గిరిరాజ్ కిశోర్.




# ఆంధ్రకేసరి

రాష్ట్రకవి.
డా.. ఓగేటి అచ్యుతరామశాస్త్రి

(శ్రీ ప్రకాశం పంతులుగారి 125వ జన్మదినోత్సవ సందర్భమున ది.23-8-1996 నాడు హైదరాబాదు రవీంద్రభారతిలో ఏర్పాటు చేయబడిన ''ప్రకాశం దర్బారులో'' చదివిన పద్యములు.)

నూటయిరువది యైదేండ్లనాటిమాట
ఆంధ్రకేసరి జన్మించెనగుట. నేడు
సంబరం బిద్ది జరిగెడు సమయమందు
ఉబికి యురి యాడుచున్నవి యూహలెన్నొ!

గోబ్యాక్సైమను నాగ్ర నాదమునభోగోళంబు భేదింప బా
హో బాహిన్నెదురొడ్డి గుండె తెఅవాయందీసి, దమ్మున్నచో
కాబోలున్నను గాల్చుటం చునిలువన్ కంపించె శస్త్రాస్త్రముల్
ఆ బందూకపు గుండ్లు పూలగములై హర్షించె నీజాలుపై

అల కర్నూలును రాజధానిగను వహ్వా, తాము మోదింపకన్
అలబెజ్వాడను నిల్పియున్నదగు నీ యాంధ్రాకృతిన్ కూల్చగాన్
తలపన్ వారలె వేసిరద్ది మరియా ధన్యాత్ములే కూల్చిరో!
భళి! నాకేమిటి పోవు దానన నవే! భాస్వత్ప్రకాశం ప్రభో!

మనకొక రాష్ట్రమేర్పడగ మాన్యుడవౌ తొలిముఖ్యమంత్రివై
ఘనమగు రాజధానియగు కర్నులు నందలి కొండరెడ్డినా
ఘనమగు బుర్జుపై నిలిచి గర్జన సేయనశోకదిమ్మెపై
తనరెడు సింహమోయను విధంబున వెల్గితి వాంధ్రకేసరీ!

లాయరు వృత్తిలోనమరెలక్షలు, పోయెను దేశసేవలో
ఆయెను ముఖ్యమంత్రి పదవక్కట! తాయము రెండు మార్లుగన్
ఖాయములయ్యెఁబో చిరుగుకట్టులు, డొక్కగు కారునున్ మరిన్
ఆయువు క్రుంగి పోతివిగహోయిగ మాకొక పెద్ద వెల్గువై!

ఎన్నిలేవయ్య! చెప్పంగ నిన్నుగూర్చి
తెలుగు వారి పురాకృతపుణ్యమీవు
జనగణంబుల, శ్రీ విజయ్‌చంద్రు, కవుల
ఆంధ్ర కేసరి! దీవించుమయ్య నేడు!

యోగులు

# శ్రీపాకల పాటి గురువులు

ఆచార్య బి. రామరాజు

(గత సంచిక తరువాయి)

కసారి విక్రమ దేవ వర్మ (1890 - 1951) తమ ఆస్థానంలో గొప్ప విద్వత్కవి సమ్మేళనం ఏర్పాటు చేసినారు. తిరుపతి వెంకట కవులు కొప్పరపు కవుల వంటి ఉద్దండులా సమ్మేళనానికి వెళ్ళినారు. మహారాజుగారు ఒక జటిల సమస్యను పూరించవలసిందిగా పండిత కవులను కోరినారు. తిరుపతి వెంకట కవులంత వారు ఐదునిమిషాల వ్యవధికోరినారు. ఆ సభలో ఒక మూలన కూర్చున్న మనబాబుగారు లేచి సమస్యను అలవోకగా పూరించినారు. మహారాజుతో పాటు పండిత కవులందరూ సాధువాదములు పలికినారు. మహారాజు బాబుగారిని తమ ఆస్థాన కవులుగా ప్రకటించి సన్మానించి మంచి వసతి గౌరవభృతి కల్పించినారు. ఆ వార్తను పత్రికల్లో చదివిన ముండూరి ప్రజలు, బాబుగారి బంధువులు తావు పోగొట్టుకొన్న మణి ఎంత అమూల్యమైనదో తెలుసుకున్నారు.

బాబుగారి జాడలు తెలిసిన తరువాత చిన్ననాటి ఆప్తుడు గారపాటి పుల్లయ్య అప్పుడపుడు వచ్చి దర్శించి పోతుండేవాడు. బాబుగారాయనను తమ గురువుగా అందరికీ పరిచయం చేసినారు. పుల్లయ్య కోరికమేరకు బాబుగారు ఒకటి రెండు సార్లు ముండూరుకు వెళ్ళివచ్చినారు. జయపురం ఆస్థాన కవిగా ప్రకటితులైన తరువాత బాబుగారు ముండూరు పండితులతో గోష్ఠి చేసి తమ విచిత్ర విద్యా వైభవం ప్రదర్శించినారు. ఒకప్పుడు వెలివేసిన బంధువులు బ్రాహ్మణ్యము బాబుగారిని విందుభోజనానికి ఆహ్వానించినారు కాని ఆయన పుల్లయ్య ఇంటనే ఉన్నారు. బాబుగారిని ముండూరులో ఉండవలసిందని ప్రార్థించినారు కాని వారు ఇష్టపడలేదు. పుల్లయ్య వెంట బాబుగారు ఏలూరుకు పయనమైతే ఆకాశం నిండా కారుమబ్బులు కమ్మినవి. పుల్లయ్య ప్రయాణం వద్దంటే బాబుగారు "మీ మీద ఒక్క చినుకు పడనీయను, మీరు గుణ్ణం బండిలో కూర్చుండండి" అన్నారు. దారి పొడుగునా ఆ బండికి వెనుకా ముందూ ఆకాశం తూట్లుపడినంత వర్షం కురిసినా బండి మీదగాని గుణ్ణం మీదగాని ఒక్కవానచినుకు పడలేదు. బాబుగారెంతటి సిద్ధపురుషులో పుల్లయ్యకు అవగతమైనది. పుల్లయ్య మొదటి సారి ఆశ్రమానికి పోతూ అడవిలో క్రూర మృగాల భయంకర ధ్వనులు విని భయపడి నాలుగు దారుల కూడలి చేరి ఏ బాట పట్టవలెనో తెలియక, ఆశ్రమం పొడ కానక "ఈయన ఇంకెక్కడ చచ్చాడురా బాబూ" అన్నాడట. ఎట్లాగో ఆశ్రమం చేరిన పుల్లయ్యను బాబుగారు ఆదరించి అన్నం పెట్టి "పుల్లయ్యగారూ! నాలుగు దారులు కలిసిన చోట విసుగుతో "ఈయన ఇంకెక్కడ చచ్చాడురా బాబూ అన్నారు కదూ" అంటూ అప్పజెప్పితే పుల్లయ్య, బాబుగారి సర్వజ్ఞత్వానికి అబ్బురపడ్డారు. మరొక సారి అనర్థులెవరో బలవంతం చేస్తే పుల్లయ్య ఆశ్రమానికి తోడుక పోతూ అడవిలో చాలా కష్టపడ్డాడు. బాబుగారు "పుల్లయ్యా! దొంగలనందరినీ ఇక్కడికి తీసుక వస్తే నీవుకూడ ఆయాస పడుతావు. మరొక సారి ఇట్లాంటి పని చెయ్యకు" మని మందలించినారు. మహాత్ముల దర్శనం వారు తలచుకుంటేనే సులభసాధ్యం కదా!

పాకలపాటి గురువులు మంత్రసిద్ధులు; యోగసిద్ధులు. వారు సాధించిన అద్భుత శక్తులు కొన్ని మాత్రమే లోకవిదితమైనవి. వెంపరాల పద్మనాభం కొడుక్కు ఎనిమిదేండ్లు వచ్చినా మాటలు

రాకపోతే పాకలపాటి గురువులను ఆశ్రయించినాడు. గురువుగారు తేనెలో గాయత్రీమంత్రం వ్రాయించి ఉపనయనం చేయించినారు. కుర్రవానికి మాటలు వచ్చినవి. బాబుగారి బంధువు ఒకామె ముండూరునుండి బాబుగారు జరిపించే భాగవత సప్తాహానికిపోయింది. పోతూ నర్సీపట్నం కరణం భార్యను తోడుకపోయింది. అక్కడున్న వారికందరికీ ఆశ్రమం, సప్తాహం వేదిక, బాబుగారు కనపడుతున్నారు గాని కరణం భార్యకు కనబడలేదు. అంటే ఎవరికి కనబడగూడదో వారికి బాబుగారు కనబడరన్నమాట. బాబుగారిది అక్షయహస్తం. వారు ఇద్దరికి కావలసినంత అన్నం కూరగాయలు వండి, దేవునికి నైవేద్యం పెట్టి, ఆ ప్రసాదం ఇంకెందరికి పెట్టినా సరిపోయేది. వంటకాల పాత్రలపై మూతలుంచి వడ్డిస్తే ఆపాత్రల్లో అన్నము కూరలు అక్షయంగా ఊరేవి. పుల్లయకు ఒకసారి ఈ అనుభవమైనది. రేషన్ దినాల్లో బాబుగారు 40 దినాలు తమ ఆశ్రమంలో యజ్ఞం చేయించినారు. వేలసంఖ్యలో వచ్చిన భక్తులకు ఆయడవిలో షడ్రసోపేతమైన భోజనాలు పెట్టించినారు. ప్రభుత్వాధికారులు ఆశ్రమానికి బియ్యం మొదలైన సరుకులు దొంగతనంగా చేరవేస్తున్నారో ఏమో అని కాపలా పెట్టించినారు. ఆశ్రమమంతా మూడుదినాలు శోధించినా వారికి పది పిడికిళ్లైనా బియ్యం లభించలేదు. బాబుగారు అధికారులతో ''ఈ నలుబై దినాలే కాదు నా ఆశ్రమానికి వచ్చే వారికి ఎన్నడూ తిండికొరత ఉండదు'' అన్నారు. పోలీసు, అటవీ అధికారుల మతులు పోయినవి. ఆ కీకారణ్యంలో సిగరెట్లు కాల్చటం అలవాటున్న అధికారులకు నాలుకలు పీక్కుపోతుంటే బాబుగారు తమ సిగరెటు పెట్టెనుండి అక్షయంగా సిగరెట్లు తీసియిచ్చినారు. ఈ వింత చూచిన అధికారులు బాబుగారి భక్తులైపోయినారు. పాకలపాటి గురువులు ఏకకాలంలో పెక్కు చోట్ల కనబడేవారు. విక్రమదేవ వర్మ ఆస్థానం జయపురంలో ఉంటూ విశాఖపట్నం సముద్రం రేవులో స్నానం చేస్తుండేవారట. రాజుగారు తన దివాన్‌తోను గుప్తచరులతోను పరీక్షచేయించి ఇది నిజమని రూఢిచేసుకున్నారు. బాబుగారు జయపురం సాహిత్య గోష్ఠులకు స్వస్తిచెప్పి నర్సీపట్నం అడవులు చేరి భీమ సింగిలో ఆశ్రమం స్థాపించుకొని గిరిజనుల పాలిటి దేవుడై పూజలందుకున్నారు.

గిరిజనులు పవిత్ర హృదయులు, అమాయికులు కనుక ఋషి సంతానమని బాబుగారి అభిప్రాయం. గిరిజనులందరూ ప్రత్యేకంగా కోయలు బాబుగారిని దైవసమానంగా కొలిచేవారు. ఆటవికుల్లో మంత్రగాళ్ళు, కట్టుబోతు విద్యలవారు, వెజ్జులు ఉంటారు. వాళ్ళ క్షుద్రశక్తులు బాబుగారి తపశ్శక్తి ముందు మిణుగురు పురుగులైనవి. బాబుగారు సలసలమసలేనీళ్ళు గిరిజనులతో స్నానం పోయించుకునేవారు. ఒక వెజ్జు ముందుకు వచ్చి తానూ నీళ్ళు పోస్తానన్నాడు. ఆతనితో నీళ్ళు పోయించుకున్న వారు ఒడలంతా దురదతో బొబ్బలు లేచి రక్తంకారి చనిపోతారు. ఆతడు నీళ్ళు పోస్తుండగా సగంలోనే వానికే దురదపుట్టి బొబ్బలు లేచినవి. అతడు బాబుగారికి పాదాక్రాంతుడై క్షమాభిక్ష వేడినాడు. అప్పటినుండి బాబుగారు దైవసమానులని ఆటవికులు ఆరాధించేవారు. బాబుగారు ఆటవికులకు భక్తి ప్రపత్తులు నేర్పి, ఆరోగ్యభోగభాగ్యాలు ప్రసాదించినారు. వారిని సన్మార్గంలోకి త్రిప్పి వసతులు కల్పించి వ్యవసాయ యోగ్యమైన ప్రాంతాలు వెదకి వెదకి చూపించినారు. దాదాపు 300 పల్లెలు పొందించినారు; 900 దేవాలయాలు ప్రతిష్ఠించినారు. ప్రతిగ్రామంలో ఒక మేకును పాతించి అక్కడ ఒక అఖండదీపం వెలిగించి ఆ జ్యోతి సన్నిధిలో ప్రతిదినం రామభజనలు సాగే ఏర్పాటు చేసినారు. తమ శక్తిని ఆ దీపశిఖల్లో నిలిపినారు. ఆటవికులు తమకష్టనష్టాలు ఆదీపంతో చెప్పుకుంటే అవి సమసి పోయేవి. బాబుగారు

తమచేతికందిన ఆకు ఇస్తే ఎటువంటి రోగాలైనా మటుమాయమయ్యేవి. గిరిజన గ్రామాల్లో ఈతిబాధలు, వశుమారకాది ఉపద్రవాలు బాబుగారు తొలగించినారు. బాబుగారితో పాటు ఎక్కిరాల భరద్వాజ, చిట్టిబాబు, నర్సీపట్నం చినబాబు, కాల్‌టెక్స్ p.S.S.వర్మ గిరిజన గ్రామాలు తిరిగి వారు ప్రదర్శించిన అద్భుతాలనేకం చూచినారు. ఈ శతాబ్దపు మరొక మహాపురుషులు ఎక్కిరాల కృష్ణమాచార్యులంటే బాబుగారికి అభిమానం. ఆచార్యులవారి మూలంగానే భరద్వాజగారు వర్మగారు బాబుగారికి సన్నిహితులైనారు. వర్మగారొకసారి భీమసింగి ఆశ్రమంలో బాబుగారికి పాదసంవాహనం చేస్తుంటే లక్షలజనం కాగడాలతో పర్వతం ఎక్కుతున్న దృశ్యం కనిపించింది. దండకారణ్య మధ్యభాగంలో శ్రీరాముడు సంచరించిన పుణ్యభూములు వర్మగారికి బాబుగారు చూపించినారు. అక్కడ బాహ్యదృష్టికి కనపడని ఋష్యాశ్రమం ఉందని బాబుగారు చెప్పినారు. ఆ ప్రయాణంలో రెండు మూడు సార్లు గుఱ్ఱంపై నుండి పడిన వర్మగారి ఒడలి నొప్పులు బాబుగారి స్పర్శా మాత్రం చేత క్షణాల్లో పోయినవి. బాబుగారి పల్లకి మోసిన ఒక గిరిజనునికి మశూచికం పోసి తీవ్రజ్వరం వస్తే బాబుగారు తమపైకి తీసుకొని ఒక రాత్రంతా బాధపడ్డారు. వర్మగారడిగితే "ఆ మనిషి మనకు శరణాగతుడైనాడు నేనెట్లా చూస్తూ ఊరుకోవటం?" అన్నారు. పాకల పాటి గురువుల పరేంగితజ్ఞానం అద్భుతమైనది. ఒక గిరిజన గ్రామంలో గురువు గారిని స్వాగతిస్తూ గిరిజన మహిళలు నృత్యం చేస్తుంటే వర్మగారితో పాటు ఆ నృత్యం చూస్తున్న మరొక వ్యక్తి మనస్సులో ఏదో వికారపు తలంపు కలిగితే గురువుగారావ్యక్తిని హెచ్చరించినారు. గురువుగారిని సంతాన భిక్ష కోరిన గిరిజన మహిళలను చూచి ఆ వ్యక్తి మనస్సు మరల చలించింది. గురువుగారు పంతులును హాస్యం పట్టించినారు. ఆయన సిగ్గుతో తలవాల్చుకున్నారు. బ్రహ్మచారిగా ఉండదలచిన ఎక్కిరాల భరద్వాజగారిని పెండ్లి చేసుకోవటానికి ఒప్పించినది కూడ గురువుగారి దివ్యశక్తియే.

(సశేషం)

## స్ఫూర్తి గీతం



చేద్దాం నవదృఢ సంకల్పం
చూద్దాం నూతన పరిణామం
పంచుదాం ఎద ఎద సందేశం
సృజియిద్దాం నవ నవ ఇతిహాసం ॥చేద్దాం॥
ప్రగతి పథంలో పయనిద్దాము
పరంపరను సంరక్షిద్దాము
ప్రకృతిలో ప్రత్యణువునాదను
ప్రేమభావమును పెంపొందించగ ॥చేద్దాం॥

జగతికి జీవం జననియని
జనచైతన్యం రవళిద్దాము
దేశం దైవం ధర్మము పట్ల
ధారణ, ప్రేరణ, దక్షత నందించ ॥చేద్దాం॥
నీది నాదను భావనలన్నీ
నీలినీడలై నిష్క్రమించగ
అభ్యున్నతికై అందరమొకటై
నవభారతమును నిర్మించగను ॥చేద్దాం॥

– డి.జి. విజయలక్ష్మి

# సహించినందుకు ప్రతిఫలం మోసం, ద్రోహం

(గత సంచిక తరువాయి)

మూలం : శ్రీ ఆనంద శంకర పాండ్యా అనువాదం : ఆర్కెగుప్త

పాకిస్తాన్ భుట్టోను ఉరితీసి నపుడు, ఇరాక్ కువైట్‌పై దాడిచేసినపుడు భారత్‌లోని ముస్లింలు హిందువులపై దాడిచేసి, వారి ఆస్తులను కొల్లగొట్టి దురాక్రమణ, దుర్మార్గములు చేసి, పరహంతకులైనారు. కాని హిందులు అందుకు ప్రతీకారం చేయలేదు. అయినా వారినే జాతీయవాదులని పిలుస్తూ, కాశ్మీరంలో దుర్మార్గములు చేయచున్న ముస్లిం ఉగ్రవాదులను క్రాంతి కారులు, ప్రగతిశీలురు అని అరుస్తున్నారు. దాని వలననే వారు దిన దిన మునకు పెరిగి పేట్రేగి పోవుచున్నారు. ఈ జరుగుతున్న వన్నీకూడా జాత్యాతీత వాదమనే పేరు మీదనే ''హిందువుల భావములను ప్రక్కన పెట్టడమంటే జాత్యాతీత వాదమునకు గోరి కట్టంటవంటిదే'' అని శ్రీరాజ్ మోహన్‌గాంధి చెప్పినారు. శ్రీ అరుణ్ శౌరి కూడా తన సెక్యులర్ అజెండా పుస్తకంలో అదేమాట చెప్పినారు. శ్రీ గిరిలాల్ జైన్ తన అంతిమ దినములలో అదే విషయమును బలపరచి రాసినారు.

ఈ అవమానం ఎందుకు:– హిందుత్వం సహనానికి ప్రతిరూపమని, హిందువులు అన్యాయములు, అవమానములు ముక్కుమూసికొని సహించవలెనని జాత్యాతీత వాదులు, పెద్దలు హిందువులకు హితోపదేశం చేయుచున్నారు. అదే విషయమును వారు ముస్లింలకు చెప్పుటకు సాహసించడంలేదు. స్వాతంత్ర్యం వచ్చినపిదప యింతవరకు 2500 దుర్మార్గములు హిందువులపై జరిగినవి. ఇంకనూ జరుగుతూనే వున్నవి కూడా. నెహ్రూ, ఇందిర, రాజీవ్ గాంధీలు, యితర సమాజవాది నాయకులు ముస్లిం ఉగ్రవాదులను, వారి నాయకులను పొందుకని పోవుచున్నారు. పాకిస్తాన్ అదెంత దూరం తమ స్నేహహస్తమును చాచిందో, అంతకన్నా హెచ్చిన ప్రమాణంలో గలాటాలు, దుండగములు, ఉగ్రవాది, ప్రత్యేకతావాది శక్తుల, ప్రాబల్యం హెచ్చింది. ఈ రోజులలో హిందువులు ధృడ సంకల్పము, నిశ్చయముతో నడిపిన చిన్నచిన్న ప్రయత్నములు కూడా ప్రతీకారముతో కాక కేవలం స్వరక్షణ కొరకు మాత్రమే. 45 సంవత్సరాల క్రితం కొందరు ముఖ్యమైన ముస్లిం నాయకులకు జాత్యాతీత వాదులు ధనము, ఉన్నత అధికారములు చేకూర్చినారు. దీనివలన బీదలు నిరక్షరాస్యులు, ఘరానాహంతకులు, పాకిస్తాన్ చెంచాగాళ్ళు అయిన ముస్లింల ఓటు బ్యాంకు ఆ రాజకీయ వేత్తలకు ప్రతిఫలంగా దొరికనది. ముస్లింలు రామజన్మ భూమిని హిందువులకు విడిచి పెట్టుట వలన స్థిరమైన హిందూ ముస్లిం మైత్రి బంధుభావం పెరుగుట ఆ జాత్యాతీత వాదులకు, కుహనారాజకీయ నాయకులకు ఇష్టంలేదు. ఇప్పుడిప్పుడు ఆనాయకులే మన దేశంలో జాతీయతకు కార్యకర్తలు అని చెప్పవచ్చును.

ప్రపంచంలో ముస్లింలకు తమవే అయిన 46 దేశములున్నవి. క్రైస్తవులకు 80 దేశములున్నవి. ఇంతయినా జాత్యాతీత వాదులు సమూహమధ్యముల కూటమి ఈ దేశమును ఓ ధర్మ సత్రముగా మార్చుటకు ప్రయత్నములు చేయుచున్నవి. ఇది జాతీయ, అంతర్జాతీయ న్యాయమునకు విరోధమైనది, అని అమెరికాలో గొప్ప పేరున్న భారతీయ రాజకీయ మేధావి ఎంబ్రి గారు అమ్నెస్టే ఇంటర్ నేషనల్ నందు ఉపన్యసించుచూ ''భారత్‌లో 70 శాతం జనులు హిందూ ధర్మమునకు చెందిన వారే కాక భారత భూభాగమును అంటిపెట్టుకొని వున్నారు'' అన్నారు.

# ప్రాచీన భారతంలో విమానాలు

– కె.బి.సోమయాజులు

భారతీయ ఋషి మహర్షులు కేవలము అధ్యాత్మజ్ఞాన సంపన్నులు మాత్రమే గాక గొప్ప విజ్ఞాన శాస్త్రవేత్తలని, అత్యంత భౌతిక యంత్రములను గూడ నిర్మించి, ఉపయోగించిన సాంకేతిక విద్యా సంపన్నులని సోదాహరణంగా పదేపదే ముచ్చటించుకోవడమయింది. నేటి అతివేగవంతమైన ప్రయాణసాధనము, దేశరక్షణకు మిక్కిలి కీలకమునైన విమానములు ఆధునికమానవునికి ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నసాధనాలు. ఐతే వీటిని రూపొందించుటలోను, ఉపయోగించుటలోను వేదకాలమునుండి భారతీయులకు వెన్నతో బెట్టిన విద్యయని సోపపత్తికంగా నిరూపిస్తే మరీ ఆశ్చర్యం కలుగుతుంది. నేడు వాయుసేన ఉపయోగించే అత్యంత ఆధునిక యుద్ధవిమానంబులైన సూపర్‌సానిక్ విమానములకన్న అధికమైన విశేషములుగల విమానాలను భారతీయ ఋషులు రూపొందించి ఉపయోగించారు. నేటి విమానములు ఖండఖండాతరములకు మాత్రమే పయనించగలిగితే నాటి విమానములు లోకాంతరములకు కూడా వెళ్లివచ్చేవి.

వివిధ విమానాలు, వాటినిర్మాణ ప్రయోగాలు వివరిస్తూ నారాయణ, గర్గవాచస్పత్యాది ఋషులు వ్రాసిన సుమారు 115 గ్రంథముల పేర్లు ప్రాచీన భారతీయ సాహిత్యంలో లభిస్తున్నాయి. ప్రధానంగా సప్తఋషులలో నొకరు, బృహస్పతి కుమారుడునైన భరద్వాజ మహర్షి నలుబది ప్రకరణములుగల 'బృహద్యంత్ర సర్వస్వము'ను గ్రంథమును రచించారు. అందులో చివరి ప్రకరణము విమానములకు సంబంధించిన ప్రకరణము. భరద్వాజుడు సూత్రముల రూపంలో రచించిన యీ గ్రంథానికి బోధానంద యతి అనువారు శ్లోకరూపంలో వ్యాఖ్యానం వ్రాశారు.

విమానమంటే ఏమో తెలుపుతూ భరద్వాజుడు, ''వేగ సామ్యాత్ విమానోఽ డజానామితి'' అని పేర్కొన్నారు. దీనికి బోధానందయతి తమ వ్యాఖ్యానంలో.

శ్లో॥ అండజేత్యత్ర సూత్రేస్మిన్ గృధ్రాద్యాః పక్షిణః స్మృతాః
ఆకాశగమనే తేషాం వేగ శక్తిం స్వవేగతః
యస్సమర్థో విశేషేణ మాతుం గణిత సంఖ్యయా
స విమాన ఇతి ప్రోక్తో వేగసామ్యాచ్చ శాస్త్రతః

అని వివరించారు. అనగా అండజములంటే గ్రద్దలు మొదలగు పక్షులు, వాటివేగాన్ని తనవేగంచేత త్రైరాశికంగా – అంటే మూడింతలుగా– అనుకరించగల సామర్థ్యము గలది, పక్షివలె గతిగలది విమానమని చెప్పబడినది.

నారాయణ ఋషి విమానమనగా

శ్లో॥ పృధివ్యప్స్వంతరిక్షేషు ఖగవద్వేగతస్స్వయం
యస్సమర్థో భవేద్గంతుం సవిమాన ఇతిస్మృతః

అని నిర్వచించారు. అనగా భూమిపైన, నీటిలోను, అకాశంమీద పక్షివలె వెళ్లగలది

విమానమన్నారు. విశ్వంభరుడన్న వారు

శ్లో ॥ దేశాద్దేశాంతరం తద్వత్ ద్వీపాద్వీపాంతరం తథా

లోకాల్లో కాంతరం చాపి యోంబరే గంతు మర్హతి

సవిమాన ఇతి ప్రోక్తః ఖేట శాస్త్ర విదాం వరైః

అని పేర్కొన్నారు. అనగా – ఒక దేశమునుండి మరియొకదేశానికి, ఒక ద్వీపమునుంచి మరియొక ద్వీపానికి ఒకలోకమునుండి మరియొకలోకానికి ఆకాశమార్గంలో వెళ్లగలదానికి విమానమని ఆకాశగమన శాస్త్రవేత్తలు నిర్వచించారు.

విమానములలో ప్రధానంగా మూడు విధములున్నవి. అవి

1. మాంత్రికములు – అనగా మంత్ర ప్రభావంతో నడిచేవి.

2. తాంత్రికములు – అనగా మాయావిద్య, శబరవిద్య, ఇంద్రజాల విద్యలసహా యంతో నడిచేవి.

3. కృతకములు : స్థూల యంత్రముల ద్వారా నడిచేవి.

కృతయుగంలో యంత్రరూపములైన విమానములు లేవట. కారణం నాటిమానవులు నాలుగుపాదాలా ధర్మమునాచరిస్తూ సంకల్పమాత్రంతోనే అణిమాద్యష్ట సిద్ధుల ద్వారా లోకాంతరాలకు వెళ్లగలిగెడివారట. త్రేతాయుగంలో ఛేదించుటకు వీలుగాని, నిప్పుతో కాల్చబడని పుష్పకాది విమానముల నిర్మాణము జరిగెడిదట. ద్వాపరములో తాంత్రికవిమానములుండెడివి. కలియుగములో యాంత్రికంబులైన విమానములను నిర్మించు పద్ధతి కనుగొనబడినది. వీటిలో ముప్పది రెండు ప్రధానయంత్రములు, ఉపయంత్రములు, చిత్రవిచిత్రములైన పదమూడు దర్పణములు – అనగా అద్దములు అమర్చబడి భూలోకమునుండి బ్రహ్మలోకమునకు పయనించగల సమర్థతగలవిగా పేర్కొనబడినవి.

త్రేతాయుగములో మాంత్రిక విమానములు ఇరువది యైదురకములున్నట్లు. తాంత్రిక విమానములలో యాభైయారు రకములున్నట్లు. కలియుగమునకు సంబంధించిన యాంత్రికవిమానములలో ఇరువదియైదు రకములున్నట్లు పై గ్రంథములలో పేర్కొన బడింది. యాంత్రిక విమానములలో మరల సుందర, రుక్మ, త్రిపురయను మూడు రకములున్నవి. త్రిపుర పేరుగల విమానములు భూమిమీద. నీటిపైన, ఆకాశమందు సమాన గతితో నడువగల విమానములు.

పైనుదహరించిన విమానములను నడుపు చోదకుల యోగ్యతలను గురించి తెలుపుతూ వారికి ప్రధానంగా 32 రకముల చోదన రహస్యములు తెలిసియుండ వలెనని, అట్టి చోదకుడు ప్రపంచమునే జయించగలడని పేర్కొన బడినది. ఈ 32 ఏవోమాయలు, మంత్రములు గాక విమానములలో అమర్చబడిన వివిధ యంత్రములే వాటిని వాడు కొనుగల ప్రజ్ఞ చోదకునకు ఉండవలెను.

(సశేషం)

# విధర్మ, విజాతీయ శక్తుల ఉచ్చుల్లో కేరళ

ముస్లింలు స్వేచ్ఛగా తమ మతాన్ని ప్రచారం చేయడం, క్రైస్తవులు అక్రమంగా ప్రవేశించి మత మార్పిడులు భారీగా సాగించడం, నక్సలైట్ల హిందుధర్మ సంస్కృతులను నాశనం చేసే యత్నాలులోని ప్రమాదాల నడుమ కేరళ కొట్టుమిట్టాడు తున్నది.

అక్కడ విద్యాలయాలు ఎక్కువ భాగం క్రైస్తవ మిషనరీల అధీనంలో వుంటాన హిందూ ధర్మాన్ని సంస్కృతిని హీనంగా చూస్తున్నారు.

నీలక్కల్ సమస్యతో కేరళ ప్రభుత్వ హిందూ వ్యతిరేకత స్పష్టమయింది.మార్గదర్శక మండలి అధ్వర్యంలో హిందువులంతా ఐక్యమై మహమ్మదీయులను, క్రైస్తవులను ఎదుర్కొని హిందూ జీవన మూల్యాలను నిలుపుకొనగల్గారు.

ముస్లింలు, క్రైస్తవులు వారి రాజకీయ కక్షీల పేరుతో మతం ముసుగులో కేరళ ప్రభుత్వాన్ని సహితం పడగొట్టగల సంసిద్ధత వ్యక్తమౌతుండగా హిందూ శాసన సభ్యులు హిందువులు కానట్లె మెలుగుతున్నారు. మచ్చుకు గతంలో ప్రభుత్వం 200 పాఠశాలలు ప్రారంభించగా అందు 2 మాత్రం హిందువులవి మిగిలిన 198 క్రైస్తవ, ముస్లింలవి. హైందవ భావన కల్గిన అభ్యర్థులనే శాసన సభలకు ఎన్నుకోవడం హిందువుల కర్తవ్యమైవుంది, అందుకు హిందూ ఓటుబ్యాంక్ అత్యవసరం.

''క్రైస్తవ సామ్రాజ్యంలో ఇండియాను కలుపుతాం'' అని క్రైస్తవులు, ''మేము మక్కా, ఇరాన్, ఇరాక్‌లలో రక్తం చిందించి పాలిస్తున్నాము అట్లాగే ఇండియా వెయ్యి సంవత్సరాలు పాలించాం. భవిష్యత్‌లోనూ అలాగే నెత్తురు పారించి ఇండియాను కోట్ల కొలదియేండ్లు పాలిస్తాం'' అంటున్నారు ముస్లింలు. అందుచేత కులవర్గ తత్వాలుడిగి హిందువులేకమై హిందుత్వాన్ని, దేశాన్ని ముఖ్యంగా కేరళను రక్షించుకోవాల్సిన అగత్యం ఎంతైనా వుంది.

కేంద్ర ప్రభుత్వాధీనంలోని కేరళ రబ్బరు బోర్డు క్రైస్తవమైంది. ఒరిస్సా, అస్సాం, త్రిపుర, బీహార్‌లలోని కొన్ని జిల్లాలు రబ్బరుసాగుకు అనుకూలంగా వున్న విషయం ముందుగా క్రైస్తవులకు తెలియపర్చబడడంతో లీజ్‌కు పుచ్చుకొని ఆ ప్రదేశాలు క్రైస్తవ మెజారిటీలుగా మార్చబడుతున్నాయి. అదేవిధంగా ముస్లింలు.

కేరళలో ముస్లింలు వెనుకబడ్డ వర్గంగా ప్రకటించబడి సౌకర్యాలు పొందుతున్నారు. వాస్తవానికి గల్ఫ్ దేశాల్లో ఉద్యోగావకాశలున్న ముస్లింలు మైనారటీలుగా ఇక్కడ చెలామణిగానవసరంలేదు.

1971 జనాభా ప్రకారం కేరళలో హిందువులు 59%కాగా 1981లో 52%గా తగ్గింది.

అక్కడి హిందూ దేవళాలు దాదాపు అన్ని 'దేవస్వాం బోర్డు' క్రింద ప్రభుత్వా ధీనంలో వున్నాయి.

సెక్యులర్ ప్రభుత్వంలో చర్చీలు, మసీదులు మినహా హిందూదేవాలయాలు, సంస్థలపై ప్రభుత్వ పెత్తనం పక్షపాతం, అవమానకరం. దేవాలయభూములు, ఆదాయం ప్రభుత్వపరం కావడాన పూజాధికాలు, ఉత్సవాలు తగిన విధంగా కొనసాగక దేవాలయాలు మూసివేయబడుతున్నాయి.

గురువాయూర్ కృష్ణాలయం గొప్ప దేవాలయాల్లో ఒకటి. ఇటీవల త్రీచూర్‌లో ప్రభుత్వ వైద్యకళాశాల మంజూరు చేసి దేవస్థానం వారు 2 కోట్ల విరాళమివ్వాలన్నారు. దాంతో కృష్ణభగవానుడు అప్పుల పాలయ్యే ప్రమాదంరాగా హిందువులు వ్యతిరేకోద్యమం తలపెట్టడంతో ప్రభుత్వం ఆ ఆలోచన విడనాడింది.

తిరువాన్యూర్ మహా దేవ దేవాలయం ధ్వజస్తంభం శిధిలంకాగా బోర్డు వారు ఆర్కియా లాజికల్ శాఖకు పని అప్పగించారు. హిందూ భక్తులు అందుకు అభ్యంతరం తెలుపడంతో దేవాలయానికి ధ్వజస్థంభం లేని కొరత కొనసాగుతున్నది.

కనుక హిందూ దేవాలయాల నిర్వహణ బాధ్యత ధర్మమండలికే అప్పగించాలని హిందువులు ప్రభుత్వంపై ఒత్తిడి తేవాలని యుంది.

పునరాగమన విషయంలో కేరళ ప్రభుత్వం నాల్గు సంస్థలకే అనుమతినిచ్చి ప్రపంచ వ్యాప్త సంస్థయైన విశ్వహిందూ పరిషత్‌కు నిరాకరించడం జరుగుతున్నది.

హిందువులుగా మారిన వారు ప్రభుత్వ సౌకర్యాలు పొందడానికి 200రూ. ఖర్చుతో కేరళ గజిట్‌నోటిఫికేషన్ అవసరమంటున్నారు. ఎక్కువ పేంది బీదలకి అసాధ్యంగా వున్నందున ఆవిధానం రద్దు చెయ్యాలని మిగతా రాష్ట్రాలలో గజెట్ నోటిఫికేషన్‌కు ఈ నియమంలేదని పరిషత్ విజ్ఞప్తి.

ఏకాత్మతా యజ్ఞ రథాలు దేశవ్యాప్తంగా యాత్ర చేసిన సమయంలో ఏ రాష్ట్రంలోనూ లేని వ్యతిరేకత కేరళలో కల్గింది. గంగాజలాలు విషపూరితమైనాయని మార్క్సిస్టులు దుష్ప్రచారంగావించారు. ఇకముందు హిందువులు అలాంటి రాజకీయ దుష్ప్రచారాలు, ప్రభావాలు సహించరు.

ప్రభుత్వ వివక్ష విధానం గ్రంధాలుగా చెప్పవచ్చు. హిందువులు ఏకమై ప్రభుత్వానికి రాజకీయనాయకులకు గుణపాఠం నేర్పి భారత్‌లో హిందూ ధర్మాన్ని, సంస్కృతిని రక్షించే కంకణ ధారులు కావాలి.

(జి.ఎం.జె)

---

# సంపూర్ణ స్వాతంత్ర్యము కొఱకు పోరాడండి

ఈనాడు మనదేశము హిందూస్థాన్‌లో పర ధర్మీయుల విషప్రచారము ముమ్మరముగా కనిపించుచున్నది. దేశ విచ్ఛిత్తికి దారితీయు యీ పరిణామములను విధర్మీయుల, అధర్మీయుల పోకడలను హిందువులు (హిందుస్థానీయులు, హిందూ దేశాభిమానులు) ప్రభుత్వము వారు గమినించి దేశ సమైక్యతను కాపాడుటకు కృషి చేయవలసినదిగా విజ్ఞప్తి చేయుచున్నాను. పది పన్నెండు వందల యేండ్లు పరధర్మీయుల పరిపాలనలో బానిసలుగా బ్రతికిన మనము యాభైయేండ్లనుండి నేతి బీరకాయలాంటి స్వాతంత్ర్యములో మ్రగ్గుచున్నాము. సంపూర్ణ స్వాతంత్ర్యము కొఱకు పోరాటము సల్పవలసిన ఆవశ్యకత యెంతైనా కలదు.

జై హింద్.

– చేరెడ్డి శ్రీరామరెడ్డి

# శ్రీవ్యాసాశ్రమము-లేఖ

శ్రీ శ్రీ శ్రీ ఇంద్రప్రస్థాధీశులునైన, గౌరవనీయులైన శ్రీ దేవెగౌడ గారికి, మరియు రాష్ట్రపతిగారికి శుభములు.

''అయోధ్య శ్రీ రాజారామచంద్రభగవాన్ జన్మస్థల విషయంలో రామభక్తుల మనో భావాలకి, విశ్వాసాలకి వ్యతిరేకంగాను, అధర్మంగా, స్వార్థంగా ప్రవర్తించి, పిచ్చి, పిచ్చి ఆలోచనలు చేసినారంటే ధర్మరక్షకులైన సాధు మహాత్ముల ఆగ్రహానికి గురి అవటమే కాకుండ నైతిక విలువలకి తిలోదకాలు వదిలి, స్వార్థపూరిత, కుళ్ళు రాజకీయ నాయకులకు 'కరసేవ' చేయవలసివస్తుంది''. ఏలినవారు తస్మాత్ జాగ్రత్త. ఓమ్‌తత్సత్.

''లోకాస్సమస్తాస్సుఖినోభవంతు''

–స్వామిదయానంద

# దేశభక్తిని మహమ్మదూ మెచ్చుకున్నాడు.

–దత్తో పంత్‌ఠేంగ్డే

ఇస్లాం అసలు నిబంధనలు దేశభక్తి భావనతోనే వున్నాయి. ప్రవక్త దేశభక్తితోసహా అన్ని ఉదార సద్గుణాలను ప్రోత్సహించాడు. మతరీత్యా కూడా అతను పూర్వమతాలమీద, అతని కాలంలోని ఇతర మతాలమీద యుద్ధాన్ని ప్రకటించలేదు. పవిత్రకురాన్‌లో పూర్వమతాలల్లోని సత్యాలను వ్యతిరేకించలేదు. భగవంతడు ప్రతి దేశానికి ప్రవక్తల నిచ్చి ఆశీర్వదించాడు.

''ప్రతి ప్రజకు ఒక మార్గదర్శకుడున్నాడు''(కురాన్:XXiii-3)

''హెచ్చరించేవాడు లేని ప్రత్యేక ప్రజలంటూ ఎవ్వరూ లేరు.''

తత్ఫలితంగా హజరత్ మీర్జా గులాం అహమ్మద్ ఇలా వ్రాశాడు: ''ఏ భూభాగానికి చెందినవారైనా ఎవరి బోధలు అక్కడ చిరకాలం గౌరవించబడ్డాయో వాళ్లను దేవదూతలుగా గౌరవించాలి. అల్లా తప్పుడు ప్రవక్తలు గౌరవించబడటాన్ని సహించడు. ప్రజామోదం పొందిన ప్రతి బోధకుడూ వందనీయుడే. బుద్ధుడు, శ్రీకృష్ణుడు, శ్రీరామచంద్రుడు అందరూ నిస్సందేహంగా దైవాంశసంభూతులే. తర్వాతి వాళ్ళ మెరుగు పూతలు వారి తొలి బోధల్ని మరుగునబెట్టి వుండవచ్చును.''

తన అనుయాయులు ఆయాదేశాన్ని మోసం చెయ్యాలని మహమ్మద్ ప్రవక్త అని వుంటాడన్నది అసంబద్ధమైన ఆలోచన.

ఈనాడు జాతీయవాదులు ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయారు. మహమ్మదీయ మతాన్ని పుచ్చుకున్న హిందూ జాతీయుల్ని తిరిగి మన జాతీయ సంస్కృతిలో ఇముడ్చుకోవటం సాధ్యమేనా? అని అనుమానం వస్తోంది.

కాని హిందూ జాతీయ సంస్కృతికి, వ్యక్తిగత ముస్లిం నమ్మకానికి పొసగదనటం సరికాదు. మన సంస్కృతి అన్నిమతాల్ని అందరు ప్రవక్తల్ని ఆహ్వానిస్తుంది. ఐతిహాసికంగాకూడా భారతీయ ముస్లింలు విదేశీయులుకాదు. వాళ్ళవీ మనలాటి రక్తమాంసాలే. మనం విదేశీయులైన హూణుల్ని, శకుల్ని కూడా జీర్ణించుకున్నాం. మన రక్తమే ప్రవహిస్తున్న వీళ్ళను కలుపుకోవటం కష్టం ఎలా అవుతుంది? విదేశీయ విరోధులు కూడా సంస్కరించబడ్డారని చరిత్ర చెబుతోంది.

(మనదృక్కోణం)

# గుజరాత్

గుజరాత్‌లోని కచ్, జామ్‌నగర్, బనస్కాంథా జిల్లాలు భారత్ - పాకిస్థాన్ సరిహద్దుల్లోనున్నవి.

కచ్:- కాన్సర్ ట్రాపిక్‌లో ఉత్తరాన సింధ్ (పాకిస్థాన్) దక్షిణాన అరేబియా సముద్రం మధ్య కీలక స్థానంలో కచ్ జిల్లా ఉంది.

రాజరికపాలనా కాలంలో కచ్-వాగడ్ అనబడేది. ప్రస్తుతం తొమ్మిది తాలూకాలుగా ఉంది. భుజ్, భాకత్ రాణా, లఖాపత్, అబ్డస, మాండ్వి, ముంద్రా, అంజర్, భాకో, రాపర్‌లు ఆతాలూకాలు.

**1961** జనాభా ప్రకారం **72.20**శాతం హిందువులు, **18.55**శాతం ముస్లింలు. **43.36**శాతం ముస్లింలు కచ్‌భాష, **0.14**శాతం మాత్రమే ఉర్దూ మాట్లాడుతారు. మైనారిటీలు ఎక్కువ మంది కచ్ మాట్లాడతారు.

జామ్‌నగర్:- కచ్ వలె జామ్‌నగర్ రాజవంశ పాలనలోదే. **1981** జనాభా లెక్కలప్రకారం **13.90** లక్షలు. పదితాలూకాలు అందు ఆ తాలూకాలు సముద్రతీరం. తీరంవెంట **300** కి.మీ. స్మగ్లర్లకు అనుకూలం. తీరంలో బహుకొద్ది గ్రామాలకు మాత్రమే రోడ్లున్నవి. ఇటీవల (**1983**) పశువుల సంతలో **3.66**లక్షల గోవులతో కలిసి మొత్తం **9.35** లక్షలు మాత్రమే పశుసంపద. కరువు, పశువధ, అక్రమ ఎగుమతి మూలంగా పశుసంపద క్షీణిస్తోంది.

బనస్కాంథా:- పాలంపూర్, వద్గం, దీసా, కాన్‌క్రెజ్, రధన్‌పూర్, శాంతపూర్, దెదార్, వావ్, తారీద్, ధనేర, డాంట తాలూకాలు **11** గలజిల్లా, బనస్కాంథా సరిహద్దున బార్డర్ సెక్యూరిటీ ఫోర్స్ చౌకీలకు జలోయ సుయిగాంలకు అక్కడ నుండి సింధ్‌లోని నాగర్‌పరకార్ తీర్పార్‌కర్‌లకు మార్గం ఉంది. (హిందూవిశ్వనుండి)

## మహోదయం

నేటి పని పైన ఆధారపడి,
రేపు రూపు దిద్దుకుంటుంది;
అడుగున పడినా...అందలమెక్కినా!
అంతా...ప్రస్తుత పనిలోనే ॥నేటి॥
వర్తమానమూ...వ్యర్థం చేస్తూ...
సోమరిలా...చతికిల బడితే...
ప్రస్తుత నిముషం గడమనుగానీ...
రేపటి బ్రతుకు అయోమయం. ॥నేటి॥
ఆత్మ స్థైర్యమూ...గుండె ధైర్యంతో,
సాధన, శోధన, తపనలతో...
ప్రయత్నమే... ఊపిరిగా చేసుకొని,
ముందడుగేస్తే!!! మహోదయం. ॥నేటి॥

—అబ్దుల్ అజీజ్, విశాఖపట్నం.

## కష్టము

లోకుల కొంపలార్చి యెటులో గడియించిన పాడు డబ్బుతో
ఆకసమెత్తుగట్టితివి హర్మ్య, మదింకను లేచుముండెపై
పైకి; మరేమిలేదు; అటుపైగల ఆగదిలోన మృత్యువే
నీకు ఘటిల్లునేని నిను నేలకు దింపుటదెంత కష్టమో!

- డా. కరుణశ్రీ



# హృషీకేశ్, హరిద్వార్ క్షేత్రములలో సాధువుల సమ్మేళనము

శ్రీ అశోక్ సింఘాల్ ద్వారా సాధువులనుండి మార్గదర్శకత్వం గురించి అభ్యర్ధన:-

న్యూఢిల్లీ/గోరక్షా, గంగా, జన్మభూమి మీద శ్రీరామ మందిరముల నిర్మాణం సాంస్కృతిక కాలుష్యనివారణ, నిరాకరణ విషయములపై సాధువులు సామూహికంగా హిందుత్వ జాగరణకోసం బయలుదేరుదురు.

విశ్వహిందు పరిషత్ కార్యనిర్వాహక అధ్యక్షులు శ్రీ అశోక్ సింఘాల్ గారి ఆధ్వర్యంలో, హృషీకేశ్, హరిద్వార్ మరియు శుక్‌తాలములలో సాధువుల సమ్మేళనములు జరిగినవి. హృషీకేశ్‌లో 1వ ఆగష్టున, హరిద్వార్‌లో 2వ ఆగష్టున మరియు 4వ ఆగష్టున శుక్‌తాలంలో సంతుల సమ్మేళనంలో నాలుగు విషయాలు విస్తారంగా చర్చించటం జరిగింది. శ్రీ అశోక్ సింఘాల్ గారు పై మూడు సమావేశాల్లో సాధువులతో జనులను జాగృతము చేయుటకు వారిని తమ ఆశ్రమములలోనుండి బయటకు వచ్చి, వారికి నాయకత్వం వహించమని విన్నవించిరి.

శ్రీ అశోక్ సింఘాల్ గారు జన్మభూమిలో రామమందిర నిర్మాణము యొక్క కార్యక్రమము విశ్వహిందూ పరిషత్ నేతృత్వంలో జరుగగలదని చెప్పిరి. మందిర నిర్మాణము తరువాత వైష్ణవులు, మరియు సాధువులందరు మందిరములో, భోగము, పూజ, ఇతర సేవా కార్యక్రమములు జరిపే విధానము ఏర్పాటు చేయుదురని చెప్పిరి.

హృషీకేశ్‌లోని కృష్ణకుంజ్ ఆశ్రమములో మాయాకుండ్ వద్ద 200మంది సంతులు హాజరైరి. గుజరాతీ ఆశ్రమ సంస్థాపకులు స్వామి వియోగానంద మహారాజ్ గారు అధ్యక్షులుగాను, హనుమాన్ మందిర సంచాలకులు డా. రామేశ్వరదాసు.గారు హాజరైరి. సమావేశంలో ప్రముఖంగా విచ్చేసిన వారిలో సర్వశ్రీ కృష్ణాచార్య మహారాజ్, స్వామి అవిరామదాసు, స్వామి దయారామ మహారాజ్ గార్లు కలరు.

హరిద్వార్‌లో నిష్కామ సేవా ట్రస్టులో జరిగిన సమ్మేళనమునకు యుగపురుషుడు స్వామి పరమానందజీ మహారాజ్ గారు అధ్యక్షత వహించిరి. సమ్మేళనంలో సంచాలన కార్యం శ్రీ ఆచార్య రామనాథ్ సుమన్ గారు నిర్వహించిరి. ఆఖాడా పరిషత్ మహామంత్రి మహంత్ గోవింద్‌దాసు మహారాజ్ గారు, జూనా అఖాడే యొక్క నరేంద్రగిరి గారు, మహానిర్వాణ అఖాడే మహంతగిరిధర్ నారాయణపురిగారు. అగ్ని ఆఖాడా యొక్క మహంత్ గంగాపురిగారు, కొలత్త వుదాసీన్ ఆఖాడా యొక్క మహంత్ మనోహర్ దాసుగారు, మహామండలేశ్వర్ ప్రకాశానంద్ గారు, మహామండలేశ్వర్ జ్యోతిర్మయానంద్ గారు, స్వామి విజ్ఞానంద సరస్వతీగారు, స్వామి చిన్మయానందగారు, వీరుకాక శ్రీ రామజన్మ భూమి యొక్క అధ్యక్షులు పరమహంస రామచంద్రదాసు 'అయోధ్య' గారి రాక కూడ ప్రత్యేకంగా చెప్పుకోతగ్గది. అక్కడ 250 మంది సాధువులు సమావేశమైరి.

పరమహంస రామచంద్రదాసు మహారాజ్ గారు, ఆఖాడాల యొక్క చరిత్రను వక్కాణిస్తూ ఘోర అత్యాచారాలనుండి పీడిత ప్రజలను రక్షించుటయె సాధువులయొక్క అఖాడాల ప్రథమ కర్తవ్యమని చెప్పినారు. విదేశి ఆక్రమణదారులనుండి రక్షించుటలో ఆఖాడాల ప్రత్యేక పాత్ర నిర్వహిస్తు వచ్చాయి. జీవిత విలువలను రక్షించుటలో, త్యాగము బలిదానం విషయాలలో అఖాడాలునిర్వహించిన పాత్రను సోదాహరణముగా వివరించిరి. శాస్త్రముల శిక్షణ దగ్గరినుండి ధార్మిక సిద్ధాంతాల నిరూపణవరకు, వివిధ విషయాలలో ఆఖాడాలు నిర్వహించిన ప్రాముఖ్యమైన

పరిస్థితుల నిర్వహణ వల్ల హిందూధర్మము ఏవిధంగా రక్షింపబడినదో వివరించిరి. నియమ నిబద్ధత వల్ల ధర్మము రక్షింపబడింది. అట్టికార్యమే నేడు అవసరమై, ఆవశ్యకమై వున్నది.

స్వామి చిన్మయానంద్ 'నివర్తమాన సాంసద్', గారు, టెహరీడామ్ నిర్మాణంవల్ల గంగా ప్రవాహాన్ని ఆపడం అనేది 'గంగామ తల్లి' యొక్క 'పవిత్రతను' పరిహరించటమే అవుతుంది అన్నారు. శ్రీ హరి చరణముల నుండి ప్రవహించే 'గంగ' భారతదేశపు ధర్మ సంస్కృతి యొక్క ముఖ్య ఆధారము. ఇట్టి దీని ప్రవాహమును ఆపుటకు ప్రయత్నించుట సాంస్కృతిక కాలుష్యమును పెంచుటయే, విశ్వాసము గౌరవములపై విశిష్టత కోల్పోవుట వలన ప్రకృతి ప్రకోపించి మానవజాతి త్రాహి త్రాహి అనే ప్రమాదం పొంచియున్నది. అందుచే వారు గంగా ప్రవాహం నిరాటంకంగా కొనసాగు కొరకు సంత్ శక్తినంతటిని వినియోగించాలని విన్నవించిరి.

శుకతాల్‌లోని దండి ఆశ్రమంలో జరిగిన సాధుసమ్మేళనంలో 50 మంది సాధువులు, స్వామి విష్ణు ఆశ్రమ మహారాజ్‌గారి అధ్యక్షతలో, మరియు శ్రీ జీవేశ్వర్ గారి ఆధ్వర్యంలో జరిగిన సభకు విచ్చేసిరి.

---

**జీవిత సభ్యులు**

| 671. Mynampati Dattudu, | 672. M.S.R. Sriprasad |
|---|---|
| C/o. M. Srinivasa Rao | Rly. Qr. No. 369E |
| Ex. Municipal Vice Chairman | Alcot Gardens |
| H.No. 23B-9-5 RR Pet. | Rajamundry - 533 101 |
| Eluru(West Godavari Dist.) | E.G. (Dist.) |

## ★ మతాభిమానము లేని వారితో చెలిమి చేయవద్దు

**"అష్టవిధపూజయు, షోడశ విధ పూజయు వద్దు. ఈ యాడంబరములతో నాకవసరములేదు. పూర్ణమైన భక్తి శ్రద్ధలుండిన, అచ్చట నేను విశ్రమింతును. దుర్మార్గులతోను, మతాభిమానములేని వారితోను, నాస్తికులతోను చెలిమి చేయవద్దు. ఆత్మ సాక్షాత్కారమునకు ధ్యానమవసరము... దప్పికగొన్న వారికి దాహమిమ్ము. ఆకలిగొన్న వారి కన్నము పెట్టుము. వాకిటయరుగుమీద పరుండనిమ్ము. నీకు బుద్ధి పుట్టిన దానమిమ్ము. లేనిచో వద్దు. కాని యాచకునిపై కోపించి మాట్లాడవద్దు. నేను ప్రవేశించుటకు ద్వారమవసరములేదు. నేనన్ని చోటులనుందును. ఆహారము లేకుండ భగవచ్చింతన మంచిదికాదు. అహంకారము, గర్వము విడిచి నీ హృదయ స్థితుడనైన నన్నే శరణుపొందుము".**

**శ్రీ షిర్డిసాయిబాబా** — ***సేకరణ : చే రెడ్డి శ్రీ రామిరెడ్డి***

---

★ ఇది మన పవిత్రభూమి; దీనికి మనం సేవచేయాలి. మనం ఈ హిందుభూమి యొక్క పవిత్ర సంతానం. దీనికి సేవచేసి, ప్రపంచంలో సర్వశ్రేష్ఠమైనదిగా దీన్ని రూపొందించటం మన పవిత్రకర్తవ్యం. మన ఈ శ్రేష్ఠకర్తవ్య నిర్వహణ కోసం మనందరం మన జీవితాల యొక్క అన్ని శక్తులను వినియోగించి, ఈ హిందూదేశాన్ని పరమ వైభవ స్థితికి తీసుక వెళ్ళాలి. ఇదే ఈనాడు మన ముందున్న లక్ష్యం. **- శ్రీ గురూజి**

---

★ భారతదేశంలోని ముస్లింలలో చాల మంది పరిస్థితులకు లోనై పూర్వమెప్పుడో హిందూధర్మాన్ని వదలి ఇస్లాం మతాన్ని స్వీకరించిన వారే ఉన్నారు. అనేక విషయాల్లో వారందరూ నేటికీ హిందువులే, స్వతంత్రము, సమృద్ధము, ప్రగతిశీలమునైన భారతదేశంలో వారు తమ ప్రాచీన ధర్మాన్ని, జీవన పద్ధతిని మళ్ళీ అనుసరించినట్లయితే అదికేవలం సహజంగా జరిగే ప్రక్రియ మాత్రమే అవుతుంది. **- మహాత్మాగాంధి**




గౌ. శ్రీ **H.D. దేవెగౌడ**, భారత ప్రధానమంత్రి

ప్రధానమంత్రి కార్యాలయం, న్యూఢిల్లీ: 110 011

*ఆదరణీయ ప్రధానమంత్రి గారికి,*

సాదర ప్రణామములు.

కాశ్మీరులోని హిమాలయ గుహలో వెలసిన శ్రీ అమరనాథ్ స్వామి వారి దర్శనార్థం వెళ్ళిన అమరనాథ్ యాత్రికుల హృదయ విదారక సంఘటన తెలిసికొని, మా ప్రధాన కార్యదర్శి ఆచార్య గిరిరాజ్ కిషోర్‌జీ ఆ దురదృష్ట విచారకర సంఘటన యొక్క వాస్తవిక వివరాలు తెలిసికొని తగిన సహాయం అందించటానికి హుటాహుటిన జమ్ము వెళ్ళినారు

**2.** జమ్ము నుండి ఆయన పంపిన నివేదిక ప్రకారం లక్షమందికి పైగా యాత్రికులు వివిధ ప్రాంతాలలో చిక్కుపడి వున్నారు. వివరాలు ఈ క్రింది విధంగా వున్నాయి.

జమ్ము : **15,000** మంది; పంచతరణి : **20,000**; శేషనాగ్ : **10,000**; చందబార్ : **8,000**; పహల్‌గామ్ : **12,000**; అనంతనాగ్ : **5,000**; రామ్‌థన్ : **5,000**; ఉద్దంపూర్ : **20,000**; నాగ్రోట : **7,000**; మొత్తం **1,07,000** మంది. ( ఒక లక్ష ఏడువేలమంది)

**3.** వివిధ పత్రికల వార్తల ప్రకారం దుర్ఘటనలో మృతుల సంఖ్య **166** నుండి **400** మాత్రమే అని. కాని అమరనాథ్ యాత్ర నుండి తిరిగి వచ్చిన వారి అంచన ప్రకారం ఆ మృతుల సంఖ్య సుమారు **1000** వరకు ఉంది.

**4.** విశ్వహిందూ పరిషత్ ఈ ఘోరకలికి ప్రగాఢ సంతాపాన్ని తెలియచేస్తున్నది. జమ్ము కాశ్మీర్ గవర్నరు శ్రీ కె.వి. కృష్ణారావు సరియైన సమయంలో శ్రద్ధ తీసుకుని వుంటే ఈ భారీనష్టాన్ని కొంతవరకు తగ్గించగలిగి వుండేవారమని మానమ్మకం. వాతావరణ సంస్థద్వారా వాతావరణ పరిస్థితిని సరియైన అంచనా వేయకపోవటం ఆ తరువాత ఉద్భవించిన పరిస్థితులకు సరిగా స్పందించి చిక్కుపడిన యాత్రికులను సురక్షిత ప్రాంతాలకు చేరవేయలేక పోవటం ఈ భారీనష్టానికి కారణం.

**5.** అక్కడ వున్న యాత్రికులకు సరిపడ ఆహారపదార్థము దుప్పట్లు వగైరాలకు తీవ్ర కరువు ఏర్పడింది. ఆహార మరియు ఇతర నిత్యావసర, అత్యావసర వ్యవస్థ ఏర్పాట్ల పట్ల ప్రభుత్వం ప్రభుత్వ యంత్రాంగం యొక్క తీవ్ర నిర్లక్ష్య ప్రదర్శన క్షమించరానిది.

**6.** కాశ్మీరులో ఇంత ఘోరం జరుగుతున్నా జమ్ముకాశ్మీర్ గవర్నరు శ్రీ కె.వి. కృష్ణారావు మరియు ప్రభుత్వ ప్రధానకార్యదర్శి ఇక్కడి పరిస్థితులు తెలిసికొనకుండా ఢిల్లీలో కూర్చుని మంతనాలాడటం ఆశ్చర్య కరంగాను, ఆవేదనగాను వున్నది. తమ ఢిల్లీ కార్యక్రమాలు రద్దు చేసుకుని వెంటనే జమ్ముకాశ్మీరు వచ్చి సహాయ చర్యలు పర్యవేక్షించవలసిన బాధ్యతను వారు విస్మరించారు.

ఆయన వెంటనే జమ్ము కాశ్మీర్ వచ్చి విపత్కర పరిస్థితులకు తగిన సహాయ చర్యలకు అదేశాలిచ్చినట్లయితే దుర్ఘటన కొంత వరకు నివారించగలిగేవారం. ప్రకృతి విలయతాండవం ఆగష్టు **22** ఉదయం మొదలుపెట్టి **22, 23, 24, 3** రోజులు సాగింది. సుమారు **30** వేల మంది యాత్రికులు శరీరం గడ్డగట్టించే మంచు గాలిలో సహాయ సహకారం లేక నిస్సహాయంగా ఆర్తనాదాలు చేస్తుండగా, వారిలో కొందరు మంచుకు గడ్డకట్టి అసువులుబాశారు.

7. వార్తా పత్రికల ద్వారా తెలిసిన మరియొక్క ఆశ్చర్యకర విషయం ఏమిటంటె గా॥ రక్షణ మంత్రివర్యులు ఆవిపత్కర పరిస్థితి 3 రోజులు సహాయక చర్యలు తీసుకోకుండా సందిగ్ధంలో వుంచటం. 3 రోజులు ముందుగా సహాయక చర్యలకు ఆదేశించినట్లయితే ఏన్నో విలువైన ప్రాణాలు నిలిచివుండేవి. రక్షణ దళాల సహాయ కార్యక్రమాలు చేపట్టింది 25వ తేది మాత్రమే. ఇది ఒక కీలకమైన పదవిలోని వ్యక్తి చేసిన సరిదిద్దు కోలేని కిరాతక చర్య. ఆ పదవిలోని వ్యక్తి యొక్క వ్యక్తిత్వమే కిరాతక మనస్తత్వం.

8. తీర్థయాత్రలలో, యాత్రికులను కించపరచి, నిరశించే వారు మీ ప్రభుత్వంలో అధిక సంఖ్యాకులు వున్నారు. అనాదిగా శతాబ్దాలుగా విశ్వమంతటికి ఆదర్శంగా వుండి ప్రస్తుత ఆధునిక విశ్వమానవులు, గౌరవింపబడుతున్న ఆధ్యాత్మిక, ధార్మిక కర్మభూమి మన భారత దేశం. ఇటువంటి పవిత్ర దేశంలో సామరస్య స్వభావం లేని సంస్కారహీనులు, ఉగ్రవాద, తీవ్రవాద మనస్థత్వం గలవారు, బాధ్యతలు నుండి పారిపోయెడివారు ప్రభుత్వ యంత్రాంగంలో వుండరాదు.

9. భవిష్యత్తులో హిందూయాత్రికుల మీద వయస్సు, శారీరక స్థితిపై ఆంక్షలు విధించే సూచనలు వున్నట్లు తెలుస్తున్నది. అటువంటి ఆంక్షలు అంగీకరింపరానివి. ఏ ప్రభుత్వంకు అటువంటి ఆంక్షలు అంగీకరింపరానివి. ఏ ప్రభుత్వంకు ఇటువంటి ఆంక్షలు ''హాజ్'' యాత్రికులపై విధించే ధైర్యము లేదు. పైగా ప్రతిసంవత్సరము భారతీయ హాజ్ యాత్రికులకు (వీరిని అరేబియన్స్ ''హిందూలు'' అనిపిలుస్తారు) అత్యధిక రాయితీలు కల్పించి సహాయసహకారాలు అందిస్తారు. కాని అతికష్టమైన క్లిష్టమైన పవిత్ర క్షేత్రాలయిన టిబెట్‌లోని కైలాష్ మానససరోవరం, పాకిస్తాన్ లోని కటస్రజ్ మరియు నాన్‌కన్ సాహిబ్ వగైరాలకు వెళ్ళు యాత్రికులకు ఏ సహాయము అందించకపోగా ఆంక్షలతో అడ్డుకుంటున్నారు. హిందూవులపట్ల ఇటువంటి ద్వంద్వవైఖరి, పక్షపాతవైఖరి హిందుస్తాన్‌లోని హిందుజాతి సహింపదు.

10. ప్రతిసంవత్సరము జరిగే ఈ పవిత్ర యాత్రకు కావలసిన ముందు ఏర్పాట్లను ప్రభుత్వేతర సంస్థలకు వదిలివేయటం జరుగుతున్నది. ప్రభుత్వం విభజించి పాలించుతున్న బాధ్యతల విషయం చాలా అసందర్భంగా వున్నది. ఈ సంవత్సరం హిందూ సంస్థలు ముందుగా విజ్ఞాపనలు హెచ్చరికలు చేసినా పట్టించుకోక నిర్లక్ష్యం వహించింది. ప్రభుత్వ నిర్లక్ష్యము కప్పిపుచ్చుకోలేనిది. ప్రభుత్వం ప్రత్యామ్నాయ ఏర్పాటు చేయక నిర్లక్ష్యం వహించటం ఈ ఘోరపరిస్థితికి కారణం.

ఈ సంవత్సరం జరిగిన మరో 2 ఘోర సంఘటనలు ఒకటి ఉజ్జయని మరియు హరిద్వార్‌లలో మరియొకటి ఈ రెండు సంఘటనలు కూడ ప్రభుత్వ నిర్లక్ష్య పరిపాలన ఫలితమే.

11. అమరనాథ్ వద్ద జరిగిన ఘోరదుర్ఘటన భారత ప్రభుత్వంతోపాటు జమ్ము కాశ్మీర్ యంత్రాంగంపై కూడ ఒక పెద్ద మాయనిమచ్చ. ఈ ప్రభుత్వ యాత్ర పట్ల రెండు ప్రభుత్వాల నిర్లక్ష్య నిరాసక్త వ్యవహారం పట్ల హైందవసమాజం మొత్తం నిరాశ చెందటమె కాక ఏహ్య భావంతో వున్నది.

12. యాత్రికుల రక్షణకు వెంటనే ఏర్పాట్లు చేసి జమ్ముతావి రైల్వేస్టేషన్ వద్ద యాత్రికులకు తిరుగు ప్రయాణం ఏర్పాటు చేయవలసినది.

13. దుర్భరమైన, దయనీయమైన సహాయక చర్యలకంటె అక్కడి మృతదేహాలను రక్షణ దళాలకు అప్పచెప్పిన, వారు మృతులను గుర్తించి ఆమృత దేహాలను దేశరాజధానికి ఆయా రాష్ట్ర రాజధానులకు పంపి ఉండేవారు. గుర్తించని మృతదేహాలను దేశ, రాష్ట్ర రాజధానులలో సగౌరవంగా అంత్యక్రియలు జరిపేవారు.

14. ఈ సంవత్సరం అమరనాథ్ యాత్రకు తరలిరావలసినదిగా హిందూ సంస్థలన్ని ప్రజలకు పిలుపునిచ్చినారు. దేశవ్యాప్తంగా విశ్వహిందూ పరిషత్ కార్యాలయమునకు అన్ని యాత్రికుల బంధు మిత్రులనుండి ఆతృతతో ఏన్నో ఫోన్సు వస్తున్నవి. ఒక్క న్యూఢిల్లీ కేంద్ర కార్యాలయమే 2,3 రోజులలో ఆరువేలకు పైగా ఫోన్లకు సమాధానం చెప్పినారు. మాకు అందిన సమాచారం మేరకు మేము సమాధానం చెప్పినాము. దొరికిన మృతదేహాల ఫోటోలు వివరాలు మాకు అందించినట్లయితే మేము కృతజ్ఞులమై వుండి, బాధితుల కుటుంబాలకు సమాచారం అందించే వారము.

15. ఎంత మంది జాడ తెలియులేదో 2,3వారాలలో మాకు తెలుస్తుంది. నిర్ణీత సమయంలోపల వారు రాకపోతే వారందరు మృతులైనట్లు భావించబడుతుంది. ఆసమయానికి మృతులసంఖ్య ప్రభుత్వం అధికారము ఖచ్చితంగా చెప్పలేకపోవచ్చు. మా కార్యాలయము ఈ విషయంలో సహాయపడగలదు. దేశం నలుమూలలనుండి వచ్చిన వారి పేర్లు అడ్రసులు ఇతర వివరాలు మా బృందనాయకులవద్ద బస్సుల యజమానులవద్ద లభించగలవు.

16. ఈ ఘోర దుర్ఘటనపై వెంటనే ఒక కమిటినీ వేసి దోషులను నిర్ణయించి తగిన విధంగా శిక్షించాలి.

17. ఈ సంఘటన ప్రాముఖ్యత, తీవ్రత లేని విషయంగా వర్ణిస్తూ మీరు స్టేట్‌మెంట్లు ఇస్తున్నారు. ఇవి నిర్ణయంతో కూడిన స్థాయి తక్కువ స్టేట్‌మెంట్లు. సున్నిత హృదయులైన దేశ ప్రజల మనోభావాలపై దెబ్బ. ఇటువంటి నాయకులు వున్నందుకు ప్రజలు సిగ్గు పడుచున్నారు. మీరు ప్రమాదాలలో దెబ్బతిని తిరిగి వచ్చిన వారినుండి వివరాలు అడుగవలసి వున్నది. ఎంతో నమ్మకంతో ప్రజలు ఎన్నుకున్న నాయకులు ఇలామాట్లాడవలసినది కాదు.

18. పర్యాటక మంత్రిత్వ శాఖను మేము అర్థించేది ఏమిటంటే ఇకముందైన దేశ, విదేశ, స్థానిక యాత్రికుల విషయమై శ్రద్ధ వహించండి. ఇటువంటి ప్రమాదముల కొరకు ప్రత్యేక నిధిని ఏర్పాటు చేయువలయును. యాత్రికుల పట్ల ప్రత్యేక శ్రద్ధ వహించాలి. ఇది చాలా సంస్కారయుతమైన, సున్నితత్వమైన ఉద్యోగం లాంటిది. దీనికోసమై పర్యాటక మంత్రిత్వ శాఖలో భాగంగా ఇంకొక భాగం కూడ ఏర్పరచవలెను.

మీ యొక ప్రత్యుత్తరమునకు ఎదురుచూస్తూ, ధన్యవాదములతో)

మీ విధేయుడు,
- అశోక్ సింఘాల్,
కార్యాధ్యక్షులు.

# అమర్‌నాథ్ యాత్ర

ఒకశోక పర్యవసానంగా మారిన గమ్యం

అత్యంత క్లిష్టమయమైన ప్రయాణము అమర్‌నాథ్ యాత్ర. 16 ఆగస్టున పహలాంమ్ నుండి హిమలింగాన్ని దర్శించుటకు ప్రారంభమైన 25000మంది యాత్రికుల కథ ఆరు రోజులలో విషాదాంతంగా మారుతుందని ఎవరూ ఊహించని విషయము.

ఆగష్టు 22న అర్ధరాత్రి 12.30గం.కు హిమాలయములమీద అసహజంగా అకాలంగా ప్రారంభమైన భయంకరమైన మంచుకురువటం, వర్షం వరుసగా 62గంటలపాటు కొనసాగింది. ఈ విధంగా ఎన్నడూ జరగనిది, ఊహించనిది సంభవించింది. జమ్ము మరియు ఉదంపూర్ నివాసులు వారి జీవితకాలంలో ఎన్నడూ అట్లాంటి విపరీతమును కనివిని ఎరుగరు. ఆ భీభత్సంలో 17,000 యాత్రికులు పంచతరణిలోను, 11,000 మంది శేషనాగులోను, 14,000 చందన్‌వారిలోను మరియు 20,000పైగా బేస్ క్యాంప్ పహల్‌గామ్‌లోను చిక్కుకపోయినారు. 22,000పైగా యాత్రికులు 'ఛడీ ముబారక్' వెంట బయలుదేరి ఉద్దమ్‌పూర వద్ద, జమ్మూనుండి సుమారు 65కి. మీ వద్ద జమ్ము- శ్రీనగర్ జాతీయ రహదారి మూసి వుండటం వల్ల ఆగిపోయినారు. సుమారు 300 కి.మీ మార్గము కొండచరియలు విరిగి పడినందున చాలావరకు నాశనమైనది. నగరోటా, బటాటో, రామవన్, బనిహాల్ మరియు పట్నాటప్ ప్రాంతాలలోని రోడ్లు విధ్వంసం చెందినవి. కొండచరియలు విరిగి పడటాన ప్రసిద్ధిచెందిన రామవన్ మార్గం పూర్తిగా ధ్వంసమైనది. భయంకరమైన వర్షంవల్ల, రోడ్లు, చిన్నచిన్న బ్రిడ్జీలు నాశనమై, నదులు, సరస్సులు, అన్నీ పొంగి పొరలి నానాభీభత్సంగా తయారు అయింది.

కొన్ని వందల మంది యాత్రికులు మంచుతో కప్పబడ్డ 6కి. మీ మార్గంలో మంచు చరియ 'గ్లేషియర్' విరిగి పడినందున దానిక్రింద నలిగిపోయినారు. మరికొన్ని వందల యాత్రికులు, పవిత్ర గుహవద్ద (3380 మీటర్ల ఎత్తు) శేషనాగు (12500 అడుగులు) మహాగుణాసు (1400 అడుగులు) మరియు పంచతరణి వద్ద చిక్కుకొని, భరించరాని చలికి తుఫానుకు అసువులు బాసినారు. ప్రభుత్వ లెక్కలలో 239 మంది మాత్రమే చనిపోయినారు. బ్రతికి బయటపడ్డవారు చెప్పిన దానికి ఇది భిన్నంగా వుంది. వారు పూర్తిగా ప్రభుత్వ లెక్కలను ఖండించి వ్యతిరేకించినారు కూడా. వారి ప్రకారం మృతుల సంఖ్య 1,000 నుండి 1,500 మధ్యలో వుంటుంది. పహల్ గామ్ మధ్య మార్గంలో శ్రీ రాజేష్ ప్రసాద్, ఢిల్లీకి సంబంధించిన అతని లెక్కప్రకారం 203 శవాలను ఆయన చూశారు. దారివెంట శవాలు పడివున్నాయి. వృద్ధులు, చేతకానివారు, నడవలేక దారివెంటే వెళ్తూవున్నారని, సహాయం అభ్యర్థిస్తూ కన్పడినారు.

ఎవరి ప్రాణాలను వారు గుప్పిట్లో పెట్టుకొని వున్న జనం ఎవరి గోడును వినిపించుకొనే స్థితిలో లేక మరో మార్గం కానక మౌనంగా, భాధగా, తమను తాము రక్షించుకొనే ప్రయత్నంలోనే ముందుకు సాగినారు. భీతిచెందిన యాత్రికులు బేస్‌క్యాంపు అయిన పహల్‌గాం చేరుటకు తొందరలో చనిపోయిన, చనిపోతున్న వారిని దాటుకుంటు ఆత్రంగా ఆందోళనలతో అలమటిస్తూ తిరుగు ప్రయాణం సాగించినారు.

చాలామంది దిక్కుతోచక, భీతితో సాగిపోతూ, జారిపోయే దారిలో నడుస్తూ లోయలలో పడిపోయిన వారు కూడా వున్నారు. ఆచలి బాధకు తాళలేక సరియైన తలదాచుకునే సదుపాయం లేక, వణుకుతో రోగగ్రస్తమైపోయినారు. ప్రయాణికులను మోసుకవెళ్లే చిన్న గుఱ్ఱములు (పోనీస్) కూడ ఉహాతీతమైన ప్రకృతి వైపరీత్యమునకు తట్టుకోలేక చలికి చనిపోయినవి.

చనిపోయిన చాలా మంది యాత్రికులు మధ్యప్రదేశ్, ఒరిస్సా గుజరాత్, మహారాష్ట్ర మరియు దక్షిణాది రాష్ట్రాలకు చెందినవారే, చాలా మంది ఆక్సిజన్ అందక, మరియు భ్రాంతికి (షాక్) లోనై చనిపోయినారు. ఎక్కువమంది వద్ద ఈ తీవ్రమైన చలిని తట్టుకొనుటకు ఏమి సదుపాయములు లేవు. చాలా సాధారణంగా ఈరాష్ట్రాలవారంతా నెత్తిన ఒక్కమఫ్లర్, ఒక్క బ్లాంకెటుతోనే వచ్చినారు. ఇదంతా అధికార్ల నిర్లక్ష్యపర్యవేక్షణ

వల్ల జరిగింది. ఎక్కడా కూడా ఎత్తు ప్రదేశాలలో కావలసిన సరియైన సదుపాయములు వారు చేయలేదు.

ఎత్తైన ప్రదేశాలలో వారు వేసిన గుడారాలలోనుండి వర్షానికి నీరులోనికి ప్రవేశించి అంతకు ముందే చలికి వణికే వారు గడ్డకట్టుకపోయే పరిస్థితి కలిగింది. పంచతరణి నుండి చందన వారి వరకు గల మార్గం పూర్తిగా బురదతో జారుతూ ప్రమాదకరంగా మారింది. దిక్కుతోచని యాత్రికులు సరియైన తలదాచుకొనే స్థలం లేక చెట్టుకొకరు పుట్టకొకరుగా పరుగెత్తినారు. భయంకరమైన చలి తుఫాను గాలులనుండి రక్షించుకొనే మార్గం లేకపోయింది. **20-25**వరకు సరిపోగల టెంట్లలోనికి బలవంతంగా **35**నుండి**45**మంది వరకు వుంచబడి గడ్డకట్టుకొనే చలినుండి కాపాడుకొనే ప్రయత్నం చేసినారు.

25 ఆగస్టు నాటికి మామూలుగా పదివేలమంది యాత్రికులతో వుండవల్సిన పహల్‌గామ్ **90,000**మందితో నిండిపోయింది. అధికారులు ఇంతమందికి ఒక్కసారిగా కావల్సిన కనీస వసతులు ఏర్పాటు చేయుటకు సిద్ధంగా లేరు. పట్టణ అధికార వర్గం మొత్తం అస్తవ్యస్తమైనది. 'లంగరు'వద్ద (వంటలు తయారు చేయుస్థలం) కుమ్ములాటలు ప్రారంభమై పెద్ద పెద్ద 'క్యూ' లు అన్ని లంగరుల వద్ద కన్పడినవి. అధికారులు చెప్పిన దానికి భిన్నంగా చాలా మందికి భోజనం అందలేదు. అదృష్టవంతులకు కొన్ని గంటలు వరుసలో నిలుచుని వుండగా పూరీలు, కొంత అన్నం లభించినది. అమ్మకానికి వున్న ఆహారం ధరలు విపరీతంగా పెరిగినవి. ఒక కప్పు టీ రూ:6నుండి10/-వరకు అమ్మినారు. ఒక్కచపాతి 5/-రూ ఒక్కపరోటా రూ 10/-కు అమ్మబడ్డవి. వ్యాపారస్తులు యాత్రికులను దారుణంగా దోచుకొన్నారు. మంచినీరు లభించక ఏనీరు దొరికితే ఆనీరు త్రాగినారు.

పహల్‌గాం నుండి తిరిగి వచ్చిన యాత్రికులు చెప్పిన దాని ప్రకారం ఇంకొక రెండు రోజులు వారు అక్కడే చిక్కుపడివుంటే పరిస్థితి ఇంకా దారుణంగా వుండేదని చెప్పినారు.

సరియైన సమాచార వసతి లేక ఊళ్లో వున్న రెండు S.T.D బూతులవద్ద గంటలు గంటలు వేచి వుండాల్సి వచ్చింది. అవికూడా మధ్య మధ్య చాలా సార్లు చెడిపోయినవి.

ఒక సివిల్ అధికారి వార్త ప్రకారం వారు టెర్రరిస్టుల వ్యతిరేక కలాపాలకు అన్నివిధాలుగా సిద్ధంగా వున్నారను కొని వాతావరణ విషయాలను ముందుగా తెలిపే మెటియరోలాజికల్ డిపార్టుమెంటు వారి భాద్యతా రహితమైన చర్యవల్ల ఈ పరిస్థితి ఏర్పడిందని ఆయన చెప్పినారు.

ఇంత క్లిష్ట పరిస్థితి నుండి చాలా మందిని తమ ప్రాణములను ఒడ్డి రక్షించింది వీరజవానులే. వైమానిక దళంవారు, ఆర్మీవారు, బార్డర్ సెక్యూరిటీ దళం వారు మరియు ప్రాంతీయులు కలిసి చేసిన సేవ శ్లాఘనీయము. యమ్1-17 హెలికాప్టర్ల ద్వారా ఇండియన్ ఏయిర్ ఫోర్స్‌వారు కొన్ని వేలమందిని, పహల్‌గామ్, జమ్ము మరియు కాశ్మీర్‌కు చేర్చినారు. ఎత్తైన ప్రదేశంలో గడ్డకట్టుకొని పోయిన వారికి టెంట్లు, బ్లాంకెట్లు వారు అందచేసి ధన్యులైనారు.

జమ్ము, ఉదంపూర్ వాసులు హృదయ పూర్వకంగా, అవస్థలలో ఉన్న యాత్రికులకు అందించిన సేవలు అత్యంత శ్లాఘనీయము. అవి మానవజాతికి వారు చెప్పిన పాఠాలవంటివి.

రోమ్‌నగరం మంటలలో తగులబడి పోతుంటే నీరోచక్రవర్తి ఫిడేలు వాయించుకొన్నట్టుగా ఇంత భీభత్సం ప్రకృతి వైపరీత్యం సంభవించి వందల యాత్రికులు మరణిస్తూ ఉంటే ఆ ప్రాంతం గవర్నర్ జనరల్ కె.వి. కృష్ణారావు గారు ఢిల్లీలో కేంద్రప్రభుత్వంతో అసెంబ్లీ ఎన్నికల గురించి మంతనాలు కొనసాగించినారు.

ఇంత జరిగినా యాత్రికులు తమ జీవిత వాంఛ ఆహిమలింగాన్ని కనీసం ప్రకృతి శాంతించిన తరువాతైనా, మరల వచ్చే సంవత్సరమైనా దర్శించుకోలేక పోతామా అని ఉబలాట పడుతూనే వున్న వారిని చూస్తుంటే వారి ఆత్మ విశ్వాసం, భగవంతునిపైన నమ్మకం ఆధృఢ సంకల్పము గురించి అభినందించాల్సిందే.

( ఆర్గనైజర్)

అనువాదం: ప్రమోద్‌వల్‌సంగ్‌కర్

## వార్తలు

ఒంగోలు :విశ్వహిందూ పరిషత్ అధ్వర్యంలో 28 -8-96న రక్షా బంధన్ కార్యక్రమం నిర్వహించబడింది.

స్థానిక యానాది కాలనీలో యానాది సంఘ అధ్యక్షులు శ్రీ అంజీరావుకు రాఖీకట్టడంతో కార్యక్రమం ప్రారంభమైంది. ఈ కార్యక్రమంలో వి.హిం.ప. కార్యకర్తలు, ఎ.బి.వి.పి. కార్యకర్తలు అనేకులు పాల్గొన్నారు

5.9.96 శ్రీ కృష్ణజయంతి, వి.హిం.ప. ఆవిర్భావ దినోత్సవ సందర్భంలో సా॥5 గంటలకు కొండమీద దేవాలయం దగ్గర సభ జరిగినది. ఆ సభలో అమరనాధ యాత్రకు వెళ్ళి వచ్చిన శ్రీమహంత్ ప్రసాద్ గారిని సన్మానించారు. శ్రీ ప్రసాద్ గారు యాత్ర విశేషాలు వివరించారు.

6.9.96న కనక దుర్గమ్మ గుడిలో సామూహిక వరలక్ష్మి వ్రతాలు నిర్వహించారు, అని ఒంగోలు ప్రఖండ ప్రముఖ్ శ్రీ గోలి నాగేశ్వరరావు తెలియజేశారు.

25.8.96న విశ్వహిందూ పరిషత్ ప్రకాశం జిల్లా తరపున సర్వ శ్రీ విశ్వనాధం, సత్యనారాయణ, సుబ్బారావు, మస్తానయ్య, వేంకటేశ్వర్లు, నాగేశ్వరరావు ప్రభృతులు ఒంగోలు జిల్లా కలెక్టరు వారిని కలిసి వారి ద్వారా ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి గౌ. శ్రీ చంద్రబాబు నాయుడుగారికి 'గోవధ' నిషేధ చట్టాన్ని తెచ్చి అమలు పరచవలసిందిగా మెమోరాండం సమర్పించారు.

వి.హిం.ప (పూర్వాంధ్ర): జులై 13,14,15 తేదీలలో సత్సంగ ప్రముఖుల, నిర్వాహకుల అభ్యాసవర్గలు అన్నవరం, విజయవాడ, గుంటూరు, నెల్లూరు విభాగ్‌లలో నిర్వహింపబడినవి.

ఆగష్టు-10,11 తేదిలలో వెదురు నగర్ వికాసకేంద్రంలో వి.హిం.ప పూర్వాంధ్ర వారిచే నిర్వహింపబడుచున్న పాఠశాలల బోధనా, బోధనేతర సిబ్బందికి చింతనా వర్గ జరిగింది. అందు మాతృమూర్తులు 22, పురుషులు 23 మొత్తం 45 మంది పాల్గొన్నారు. (మా.వి)

వరలక్ష్మి వ్రతాలు: ఇందూరు విభాగ్‌లోని నిర్మల్ జిల్లాలో సామూహిక వరలక్ష్మి వ్రతాలల్లో 100 మంది, కమ్మర పల్లిలో 50 మంది, ముప్కాల్ ప్రఖండలో 50 మంది పాల్గొనగా, ఇందూరు నగరంలో 108 మంది మాతృమూర్తులు పాల్గొనినట్లు వార్తలందినవి.

---

★ అర్చకుల ఊరేగింపు:- (సెప్టెంబర్. 9-9-'96)

ఆంధ్ర రాష్ట్రము నందలి వివిధ ప్రాంతములందు ఉన్నదేవాలయ అర్చకులు సుమారు ఒకవెయ్యి మంది, రాష్ట్ర దేవాదాయ ధర్మాదాయ కార్యాలయము ముందు ఒకదినమునిరాహారదీక్ష సలిపి ఊరేగింపుగా వెళ్లిరి. మంగళ వారమునాడు రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ చంద్రబాబు నాయుడును కలసి అర్చకుల సమస్య పత్రము సమర్పించి, పరిష్కరించవలసిందిగా విజ్ఞప్తి చేస్తారు, అని శ్రీ యస్. రంగా చార్యులుగారు తెలిపారు.

---

★ అమలాపురంలో వి.హిం.ప.వారు గోవధ నిషేదిస్తూ చట్టం తేవాలని 25-8-96 సామూహిక నిరాహార దీక్ష జరిపారు.

---

★ భాగ్యనగర్‌లో హైదరాబాద్ విముక్తి దినం (17.9.96) హిందూ వాహిని అధ్వర్యంలో పాటించబడింది. ఆ సభలో సర్వ శ్రీ సోమయాజులు (RSS), దత్తాత్రేయ (M.P), బాల్‌రెడ్డి (MLA) లక్ష్మణ్ మరియు స్వాతంత్ర్య సమరయోధులు పాల్గొన్నారు.

★ హైదరాబాద్ సంస్థాన విమోచన వీరుడు, ఉక్కు మనిషి సర్దార్ పటేల్. (మా.వి)



## అద్భుతం:- అత్యద్భుతం
## పెట్రోలు లీటరు రూ 2.00లే

ఆకుపసరు నుండి పెట్రోలు తయారుచేయ వచ్చని శాస్త్రవేత్తలకు షాక్ నిచ్చిన పదవతరగతి చదివిన ప్రత్యక్ష అనుభవంగల మహాశాస్త్రవేత్త శ్రీ రామర్ పిళ్ళై. తమిళనాడు వాసి. పెట్రోలు తయారు చేస్తున్న దృశ్యం. తమిళనాడు ముఖ్యమంత్రి సమక్షంలో.



ఒంగోలులో వి.హిం.ప. కార్యకర్తలు ఆసుపత్రిలో పండ్లు పంచు దృశ్యం.

ముప్కాల్‌లో వి.హిం.ప. మహిళలు కుట్టుశిక్షణ శిబిరప్రారంభం - శ్రీ వై. రాఘవులు గారి సమక్షంలో



అమర్‌నాథ్ యాత్రకు వెళ్ళిన ఆం. ప్రదేశ్ బజరంగ్‌దళ్ కార్యకర్తలు. - శ్రీనగర్

---



---

BOOK - POST


Published by T Linga Murthy for Viswa Hindu Parishad, A.P 4-5-212, 'Vijayasree', Koti,